# వయసు కథలు



వేదగిరి రాంబాబు



శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్
1-8-481, చిక్కడపల్లి
హైద్రాబాద్-500020

# Vayasu Kadhalu - Short Stories

**By VEDAGIRI RAMBABU**

First Edition
August, 1993

Price: Rs.20/-

Cover and Illustrations:
**Anand A.V.B.S**

Printed at:
**Gayatri Art Printers,**
5-9-33, Basheerbagh, Hyderabad - 500 029.
Phone: 230210

# ముందు మాట

వయసులో వున్నప్పుడు వువ్వెత్తున ఎగిసిపడ్డ ఆలోచనలలో కొన్నింటికి కథా రూపకల్పనే ఈ 'వయసు కథలు'. ఏ వయసు ముచ్చట ఆ వయసుది! అలాగే ఏ వయసు రాతలు ఆ వయసువేమో?

ఈ వయసు వెల్లువ అన్ని వయసుల వాళ్ళనీ అలరిస్తుందని ఆశిస్తున్నాను. ఒక వయసులో వున్న వాళ్ళని మరో వయసులోకి తీసుకు వెళ్తుందనీ భావిస్తున్నాను.

వీటిని మొదట తమ పత్రికలలో ప్రచురించిన పత్రికాధిపతులందరికీ నా కృతజ్ఞతలు. ముఖ్యంగా స్వాతి సంపాదకులు వేమూరి బలరాంగారికి; ఆంధ్రభూమి సంపాదకులు సి. కనకాంబర రాజుగారికి, ఆంధ్ర పత్రిక సంపాదకులు వీరాజీ గారికి ప్రత్యేక కృతజ్ఞతలు. ఈ పుస్తకానికి అందమైన కవరు పేజీనే కాకుండా, కథలకి చక్కటి బొమ్మలు వేసి పెట్టిన మిత్రుడు ఆనంద్‌కి, పుస్తక ప్రచురణకు సహకరించిన మిత్రులు చొక్కాపు వెంకటరమణ, జి. మల్లేశ్వరరావులకు, నా కృతజ్ఞతలు.

-వేదగిరి రాంబాబు

15-8-1993

రచనా వ్యాసాంగంలో

అక్షరాభ్యాసం చేయించి,

రచయిత అనిపించుకోవడానికి

కారకులైన శ్రేయోభిలాషులు,

ప్రముఖ రచయిత విహారిగారికి

ప్రేమతో ఈ కథల సంపుటిని

అంకితమిస్తున్నాను.

-వేదగిరి రాంబాబు

15-8-1993

# ఇందులో కథలు

# వయస్సు

విసుగ్గా వాచీ చూసుకుంది సీత. అయిదు నిమిషాలు తక్కువ ఆరు! అయిదున్నర కల్లా వస్తాను. సిన్మాకెళ్దాం రెడీగా వుండమని చెప్పి ఆఫీసుకెళ్ళాడు మూర్తి. గబగబా తన పనులన్నీ ముగించుకుని అయిదు గంటలనుంచే అతని కోసం ఎదురు చూస్తూ కూర్చుంది సీత.

సెకండ్లు నిమిషాలుగా మారుతున్నాయ్-

ఆమెలోని సంతోషం నిస్పృహగా మారుతోంది. సహనం క్రమక్రమంగా నశిస్తోంది. చిరాకు విపరీతంగా పెరిగిపోతోంది. రకరకాల ఆలోచనలు మనసుని ముసరసాగాయ్.

ఆఫీసులో అనుకోకుండా అర్జంట్ పనేమైనా తగిలిందేమో?

అయితే మాత్రం తను ఇక్కడెదురు చూస్తుంటుందని తెలియదా? ఇదే మరో రోజైతే తనింతగా బాధ పడేదికాదు. ఇవాళ తమ పెళ్ళిరోజు..... ఎంతో ఆనందంగా గడపదల్చుకున్న రోజు. సిన్మాకెళ్ళి అట్నించటే ఏదో హోటల్లో భోంచేసి సర్దాగా గడిపెయ్యాలని ఎప్పట్నించో అనుకుంటూ వచ్చారు. తీరా ఇవాళ.....

చిరాగ్గా పడక్కుర్చీలో వెనక్కి వాలి కళ్ళు మూసుకుంది సీత. ఇంతలో వాకిట్లో ఆటో ఆగిన శబ్దం వినబడ్డంతో ఉలిక్కిపడి లేచి, గబగబా గుమ్మం దగ్గరికెళ్ళింది. ఆటోలోంచి ఎదురింటతను దిగాడు. వెనకే అతని భార్య వుంది.

వాళ్ళిద్దరినీ చూస్తుంటే ముచ్చటగా వుంది సీతకు. వాళ్ళా ఇంట్లోకి వచ్చి వారంరోజులు కావస్తోంది. కొత్తగా పెళ్ళయినట్లుంది. అతనాఫీసులో వున్న ఏ కొద్ది క్షణాలో వాళ్ళిద్దరూ విడిగా వుండేది.

సాధారణంగా అయిదున్నర కల్లా అతనింటికి వచ్చేస్తాడు. అరగంటలోపే తయారై చిలుకా గోరింకల్లా బయటికి బయలుదేరుతారు. ఎక్కడెక్కడో తిరిగి తిరిగి ఎప్పటికో ఇంటికి జేరుకుంటారు. ఎంతో అన్యోన్యంగా చూసేవాళ్ళకే ముచ్చటేసేటట్లుండే వాళ్ళను చూస్తుంటే అదో విధమైన ఆనందం కలుగుతుంది సీతకి.

పెళ్ళైన కొత్తల్లో తామూ అట్లాగే వుండేవారు. కొత్తల్లో ఏంటి, మొన్న మొన్నటి దాకా అట్లాగే వుండేవాళ్ళు. తనని విడిచి ఒక్కక్షణం వుండడానికి కూడా విల విలలాడిపోయేవాడాయన. వంట చేస్తున్నప్పుడు కూడా కబుర్లు చెప్తూ వంటింట్లోనే కూర్చునేవారు. కూరలు తరిగివ్వడం మొదలైన పనుల్లో సహాయపడాలని చూసేవారే కాని తనే ఆ పన్ల జోలికి రానిచ్చేది కాదు. మగవాళ్ళటువంటి పని చేయడమంటే తనకిష్టముండదు.

"మీరలాకూర్చుని కబుర్లు చెప్పండి చాలు. నేను క్షణంలో కానిచ్చేస్తాను వంట. ఆ తరువాత ఇద్దరం కలిసి కాసేపు అలా బయటికెళ్ళి వద్దాం" అనేది తను.

తలూపేవారాయన.

అసలు తనేది చెప్పినా కాదంటేగా....

ఆటో సర్రున దూసుకుపోయింది. ఆలోచన్లోంచి బయటపడింది సీత.

ఆమె చూపులప్రయత్నంగా సందు చివరకూ పరిగెట్టాయి.

ఎక్కడా భర్త వస్తున్న జాడ లేదు.

ఉక్రోషం ముంచుకొచ్చింది సీతకి. చరచరా లోపలికెళ్ళి పడక్కుర్చీలో కూలబడింది. మళ్ళీ ఆలోచన్లామెని చుట్టుముట్టాయ్!

మొదట్లో అయిదున్నరకల్లా ఆఫీసునుంచి వచ్చేవారు. ఆయనొచ్చేసరికల్లా శుభ్రంగా తయారయి చిరునవ్వుతో వాకిట్లో

ఎదురవ్వాలి తను! లేకపోతే ఎంతో కోపం! ఆ రోజంతా ఆ కోపమలానే వుండేది. ఆ కోపం పోగొట్టడానికి తవెన్నో కబుర్లు చెప్పాల్సివచ్చేది.

తనకి పువ్వులంటే ఎంతో ఇష్టమని ఆయనకి తెల్సు. పూలు తీసుకురాకుండా ఏ రోజూ వచ్చేవారు కాదు. ఆయన జ్ఞాపకశక్తికి తనే ఎంతో ఆశ్చర్యపడేది.

ఒక్క పూలవిషయంలోనే కాదు ప్రతీ విషయంలోనూ తన ఇష్టాయిష్టాలు ఆయనకి తెల్సు. వాటి కనుగుణంగా ప్రవర్తించేవారు. పొరబాటున కూడా వ్యతిరేకంగా ప్రవర్తించి బాధ కల్గించేవారు కారు.

అలిగి- ఆయనచేత బ్రతిమాలించు కోవాలని తనకి సరదా. కానీ అలగడానికి అసలు అవకాశమే దొరికేది కాదు. తనే మాత్రం అన్యమస్కంగా వున్నా, వంట్లో బాగుండకపోయినా తల్లడిల్లిపోయేవారు.

మరిప్పుడో-!?

ఇదివరకటిలా ఆఫీసొదలగానే సరాసరి ఇంటికి రావడం లేదు.

ఎందుకొస్తారు? ఇంటికి రాగానే ఎదురొచ్చేది తన మొహమేగా! చూసి చూసి మొహం మొత్తుంటుంది. ఆ విషయం కప్పిపుచ్చడాన్కి ఆ పని, ఈ పని అని కథలు..... తన ఇష్టా-యిష్టాల్నికూడా అసలు పట్టించుకోవడం లేదు. అంతగా మొహం మొత్తిందా తను.... ఆ ఆలోచన రాగానే వులిక్కిపడింది సీత.

లేచి గబగబా నిలువుటద్దం ముందు కెళ్ళి, అద్దంలో తన మొహాన్ని పరీక్షగా చూసుకొంది.

చూస్తున్నకొద్దీ ఆమెకే ఆశ్చర్యం వేస్తోంది. చెంపల దగ్గర, పాపిట దగ్గర వెంట్రుకలు తళుక్కుమంటున్నాయ్. భయంతో ఆమె శరీరం గగుర్పొడిచింది.

తను తలంటి పోసుకుని తలారబెట్టుకుంటుంటే చూట్టం ఆయనకెంతో సరదా!

ఆ నల్లటి కురుల్ని చెంపలకానించుకుంటూ "సీతా! నీ తెల్లటి మొహానికీనల్లటి కురులెంతందాన్నిస్తున్నాయో తెల్సా" అంటూ ఎంతో తన్మయత్వాన్ని పొందేవారు.

కానీ.....

తన జుట్టు నెరిసిపోతోంది!

మరింతగా నిశితంగా చూసింది తన ప్రతిబింబాన్ని. జుట్టు నెరవడమే కాదు. కళ్ళకింద నల్లటి చారలొచ్చాయ్! ఒక వేళ కాటికంటిందేమోనని టవలందుకుని గట్టిగా తుడిచింది. చర్మం మంట పుట్టిందేగాని ఆ నలుపు పోలేదు.

అంతేకాదు - మొహంలో ఇంకా చాలా మార్పులొచ్చాయ్. నునుపుగా పొంగినట్లుండే బుగ్గలు పీక్కుపోయాయ్.

సీత వుక్కిరి బిక్కిరైంది. తన్లో ఇంత మార్పా? ఆనాటి అందం, ఆకర్షణ ఇంత త్వరగా తగ్గిపోయాయేంటి!

"సీతా! నీ బుగ్గలు చూస్తుంటే నా కేమనిపిస్తోందో తెల్సా? కసిక్కున వాటిని కొరకేయాలనిపిస్తోంది! పెళ్ళిచూపుల్లో అసలు నీ బుగ్గలు చూసే పడిపోయేను" మూర్తి కవ్వింపు గుర్తుకొచ్చిందామెకు.

"అరె పాపం! బాగా పడ్డారా నేను గమనించనేలేదు. లేకపోతే ఏ చీరో చించి కట్లు కట్టేదాన్ని." వెంటనే తను నవ్వేసేది.

"సీతా! నువ్వు నవ్వుతుంటే నీ కళ్ళెంత బావుంటాయో తెల్సా? చటుక్కున వాటిని ముద్దు పెట్టుకోవాలనిపిస్తుంది."

అప్పటి సంభాషణ ఒక్కసారి మనసులో మెదిలింది. మరోసారి అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకొంది సీత.

అవును తనలో చాలా మార్పొచ్చింది. తనింతవరకూ గమనించనే లేదు.

ఒకవేళ.... ఒకవేళ తనాయనని ఇదివరకటిలా ఆకర్షించలేకపోతోందా? అందుకే ఆయన తనంటే నిర్లక్ష్యం చూపుతున్నారా? ఏమో..... అయ్యుండచ్చు. లేకపోతే ఇలాంటి ముఖ్యమైన రోజు కూడా ఇలా ఎందుకు చేస్తారు?

కాసేపలా స్థాణువులా నిల్చుండిపోయింది సీత.

"మమ్మీ! డాడీ ఇంకా రాలేదా?" పదేళ్ళ పాప, ఆరేళ్ళ బాబు బయటనుంచి పరుగెత్తుకొచ్చారు.

వాళ్ళకక్కనిపించకుండా వుండాలని చటుక్కున టవలందుకుని కన్నీళ్ళు తుడుచుకుంది సీత.

"లేదమ్మా..... ఇంకా రాలేదు."

"ఇంకా ఎప్పుడొస్తారమ్మా. సినిమాకి టైం కూడా అయిపోయిందిగా!" బాబు నసిగాడు.

"నాన్నగార్కి ఆఫీసులో ఏమైనా అర్జంటు పని తగిలిందేమోనమ్మా. పోన్లే సినిమాకి రేపెళ్దాంలే.... "తనే ఇంత అప్సెట్టయితే వాళ్ళెంత బాధపడ్డారో అని జాలేసిందామెకి.

"హు! దుర్గావాళ్ళింటికి ఆడుకోడానిక్కూడా వెళ్ళకుండా జేశారు సినిమాకి వెళ్దామని."

"పోన్లే అమ్మా! తమ్ముడ్ని తీసుకొని దుర్గావాళ్లింటి కెళ్ళి కాసేపాడుకుని రండి. సినిమాకి రేపు తప్పకుండా వెళ్దాం" పాప మాటల్ని మధ్యలో తుంచేస్తూ అంది సీత.

"మరి మేం వెళ్ళగానే డాడి వచ్చేస్తే" బాబు సందేహం.

"వచ్చేస్తే వెంటనే మిమ్మల్ని పిలుస్తాం. అందరం కలిసే సినిమాకెళ్దాం."

"ఓ.కే వస్తాం మమ్మీ" ఇద్దరూ వాకిట్లోకి పరుగెట్టారు. వాళ్ళ వెనకే గుమ్మంలోకొచ్చింది సీత. ఆత్రంగా ఆమె కళ్ళు సందుచివరి వరకూ పరుగెట్టాయ్.

మూర్తి వస్తున్న జాడలేదు.

సందు చివర ఆకుపచ్చచీర తళుక్కుమంది.

భవాని!

హఠాత్తుగా ఆమెకి మూర్తి రెండ్రోజుల క్రితం అన్న మాటలు గుర్తుకొచ్చాయ్.

"సీతా మా ఆఫీసులో భవాని అని కొత్త టైపిస్ట్ చేరింది. వుండటం కూడా మన వీధిలోనే! సందు మొదట్లో వున్న గోపీరంగు మేడలో ఉంటున్నారట. ఆ అమ్మాయిని చూస్తుంటే పెళ్ళిచూపుల్లోని నీ రూపమే గుర్తుకొస్తుంటుంది. ఆమె బుగ్గలు కూడా అచ్చు నీ అప్పటి బుగ్గల్లానే నునుపుగా, పాలుగారుతున్నట్లుంటాయ్" అతని మాటల్తోపాటు చిరునవ్వు మొహం కూడా ఆమె కంటి ముందు మెదిలింది.

ఆమెకి కొద్ది వెనగ్గా వస్తూ మూర్తి కనిపించాడు.

సీత మొహం చిరాకుతో ముడిపడింది. కోపం కళ్ళలో ప్రతిబింబించింది.

ముందు హొయలు ఒలకబోస్తూ ఆ పిల్ల, వెనక తన భర్త!

అవును! ఒకప్పుడాయన్ని ఆకర్షించిన నునుపాటి పాలుగారు బుగ్గలు తనకిప్పుడు లేవు. ఇప్పటి తన వయసు ఆ నునుపుదనాన్ని కనబడకుండా చేసింది. ఆకర్షణ అడుగంటిపోయింది. అవన్నీ ఇప్పుడా పిల్ల భవానీలో ఉన్నాయ్. అందుకే ఆయనన్నాకర్షించుంటుంది! ఆ పిల్లంటే ఆయనకెంత మురిపెమో ఆ రోజు మాటల్లోనే వ్యక్తపరిచారు. ఇంత వరకూ తను కనిబెట్టలేక పోయింది. పిచ్చిదాన్లా ఆయన ఆలస్యానికి, నిర్లక్ష్యానికి ఇంకేమేమో కారణాలూహించుకుంది. సీత మనసు చికాకై పోయింది. కుర్చీలో వెనక్కి వాలి కళ్ళు మూసుకుంది.

"సీతా.... సీతా......" మూర్తి గొంతామెకి హడావిడిగా వినిపించింది. ఆమెకి కళ్ళు తెరవాలని, అతన్ని చూడాలని అనిపించలేదు.

"ఏంటి సీతా అలా వున్నావ్! వంట్లో బావుండలేదా?" మీదకి వొంగి ఆమెని కుదుపుతూ అన్నాడు మూర్తి.

అతని చెయ్యి మీద పడేసరికి ఆమెకి కంపరమెత్తింది.

"ఏంలేదు. బాగానే వున్నాను" అతని చెయ్యి పక్కకి తోసేస్తూ అంది.

"మరెందుకలా పడుకున్నావ్?"

"వూరికే"

"సారీ సీతా! ఆఫీస్‌లో అర్జంటు పనుండి లేటైంది. సెకండ్ 'షో'కి టికెట్లు పట్టుకొచ్చాను. నువ్వు తొందరగా లేచి

తయారయ్యావంటే కాసేపలా ఏ పబ్లిక్ గార్డెన్‌లోనో గడిపి, ఆ తర్వాత ఏ హోటల్లోనో భోంచేసి సినిమాకెళ్దాం. ప్లీజ్!లే..... త్వరగా తయారవ్వు, అతనలా బతిమాలడం ప్రారంభించే సరికి ఆమె కోపం మంచులా కరిగి పోయింది. బాధగా పెట్టిన అతని మొహాన్ని చటుక్కున దగ్గరకు లాక్కొని ముద్దు పెట్టుకోవాలనిపించింది.

వెంటనే భవాని గుర్తుకొచ్చింది.

ఈ విషయాన్నివాళే తేల్చేయాలి! గట్టిగా నిశ్చయించుకుంది.

"నేనెందుకు మీతో సినిమాకి?మీ కిష్టమైన ఆ టైపిస్ట్‌పిల్లుందిగా! దాన్తోనే తిరగండి."

"సీతా!"నివ్వెరపోతూ అన్నాడు మూర్తి.... "ఏంటామాటలు? నీకేం మతిపోలేదు కదా?"

"పోయినా బాగుండేది మీ ప్రేమకలాపాలు తెలీకపోయేవి....."

"ఛత్ అలా ఇష్టం వచ్చినట్లు మాట్లాడకు. ఆ పిల్ల వయసేమిటి? నా వయసేమిటి? అర్థం వుండక్కర్లా అలా అపోహలు పడటానికి"

— "ఇందులో అపోహలేమున్నాయ్?" ఆ రోజు మీరన్లేదూ ఆ పిల్లకి అచ్చం అప్పటి నాలానే నున్నటి బుగ్గలున్నాయి. నాలానే ఎంతో బావుంటుందని....."

అతనామె దగ్గరకి వచ్చి భుజం మీద చేతులేసి ఆప్యాయంగా అన్నాడు.

"పిచ్చి సీతా! ఏ వయసాకర్షణ ఆ వయసుది! నేనా బుగ్గలకోసమే నిన్నే కోరి పెళ్ళాడిన మాట వాస్తవమే. ఆ ఆకర్షణ, కోరిక ఆ వయసుది. ఇప్పటి కోరికలు, ఆకర్షణలు వేరు. వయసుతో పాటు మానసికంగా కూడా ఎన్నో మార్పులొస్తాయి. ఇప్పుడు

నాక్కావలసింది అందచందాలు కాదు. ప్రేమానురాగాలు, ఆ పిల్లల్ని పెంచి పెద్ద చేయడానికి సంపూర్ణ సహాయ సహకారాలు..... ఒక్కసారి నా వంక చూడు. నీలో వచ్చాయని బాధపడుతున్న శారీరక మార్పులు నాలో రాలేదా? అయినా నువ్వా మార్పుల్ని గమనించనే లేదు. అసలా మార్పులే వయసుకి తగ్గ హుందాతనాన్ని తెచ్చిపెడతాయ్. భవానీని చూస్తుంటే ఇప్పుడు నాకేమనిపిస్తోందో తెల్సా? ఇంకో ఏడెనిమిదేళ్ళు పోతే మన పాప కూడా నీ లానే ఉంటుందేమోనన్న ఆలోచన. అంతే! ఇప్పుడేఆడపిల్లని చూసినా నాకామెలో కనిపించేది పాప ప్రతిబింబమే.

తనకింతవరకూ కల్గిన నీచమైన ఆలోచన్లకామెకి సిగ్గేసింది. అప్రయత్నంగా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"పిచ్చిపిల్లా! ఎందుకా కన్నీళ్ళు. తప్పు నువ్వివాళ కంటతడి పెట్టకూడదు"

ఆమె కన్నీళ్ళు తుడుస్తూ దగ్గరికి తీసుకున్నాడు మూర్తి. ★

(స్వాతి మాసపత్రిక అక్టోబరు 1978)

# తప్పు వయసుది!

ఒకే వయసువాళ్ళ మధ్య స్నేహం బాగా వృద్ధి చెందుతుంది అని నా గట్టి నమ్మకం.

రావుతో పరిచయం కాకుండా వుంటే ఇంకా ఆ నమ్మకంలోనే వుండేవాణ్ణి. కానీ వయసుకీ, స్నేహానికీ ఎటువంటి సంబంధమూ లేదు అనే విషయాన్ని అతన్తో పరిచయమైన ఈ ఆర్నెల్ల కాలం ధృవపరిచేసింది.

ఉద్యోగరీత్యా నేను హైదరాబాద్ చేరుకుని ఆర్నెల్లైంది. ఈ ఆర్నెల్లలో కనీసం అరవైమందైనా పరిచయమయ్యారు. కానీ ఎవ్వరితోనూ పెంపొందని స్నేహం రావుతోనే పెంపొందింది.

అతను నాకన్నా ఏడెనిమిదేళ్ళు పెద్దవాడు!

వయసులోనే కాదు, వుద్యోగంలో కూడా అతను నా పైమెట్టుమీదే వున్నాడు! కాకపోతే ఇద్దరం వుండడం ఒకే ఏరియాలో.

ఆఫీస్‌లో కాకుండా వచ్చేప్పుడు, వెళ్ళేప్పుడు కూడా కొంత సమయాన్నికల్సివెచ్చించాల్సివచ్చేది.

సక్రమంగానే పరిచయం పెరిగి ఒకళ్ళ ఇంటికి మరొకళ్ళ రాకపోకలు మొదలయ్యాయి.

వంటరిగాణ్ణి-నారూమ్ అతనికి ఏమైనా రిలీఫ్‌ని ఇచ్చేదో లేదో గాని, వాళ్ళింటికి వెళ్ళడం నాకు మాత్రం 'హోమ్‌సిక్'ని దూరం చేసేది.

శారద అన్ని విధాలా అతనికి తగ్గ భార్యే!

వాళ్ళిద్దరి ఆప్యాయత, నా హైద్రాబాద్ జీవితానికి జీవాన్ని ఇచ్చింది.

వీళ్ళతో పరిచయం కాకుండా వుంటే ఉద్యోగంలో చేరిన మర్నాటినుంచే మా వూరి వేపు ట్రాన్స్‌ఫర్ చేయించుకోవడానికి ప్రయత్నించే వాణ్ణేమో!

ఆఫీస్‌కి శలవు వచ్చిందంటే వాళ్ళింటికి భోజనానికి వెళ్ళక తప్పదు....

భోజనం.... కబుర్లు..... పేకాట.... సినిమా.....

ఇట్టే గడిచిపోతుంది రోజు!

అలవాటు ప్రకారం ఆ ఆదివారం నాడు పదిగంటల కల్లా బయల్దేరాను రావు వాళ్ళింటికి.

దార్లో చలపతి నిలబెట్టేశాడు.

డిగ్రీ అయింతర్వాత అదే అతన్ని కలవడం!

ఆ కబుర్లు, ఈ కబుర్లు...

గంట గడిచిపోయింది......!

పదకొండు!

ఆఫీస్‌కైనా ఆలశ్యంగా వెళ్ళుగాని మా ఇంటికి వచ్చేప్పుడు మాత్రం ఆలశ్యంగా రావద్దనే వార్నింగ్‌ని రావ్ ఎప్పుడో ఇచ్చాడు! ఇంకా నేనెందుకు రాలేదా అని వాళ్ళిద్దరూ ఎదురు చూస్తుంటారు. ఇంక ఆలశ్యం చెయ్యటం బావుండదు.

మళ్ళీ కలుస్తానని, చలపతి అడ్రస్ తీసుకొని రావు ఇంటివేపు బయల్దేరాను.

ఇవాళ అతని చేతిలో చివాట్లు తప్పవు.

ఆలోచనల్తో సంబంధంలేకుండా అడుగులు గబగబా పడసాగాయ్.

రావు ఇంటికి చేరుకోవడానికి మరో ఐదు నిముషాలు పట్టాయ్.

వాళ్ళింటికి వేళ్ళాడుతున్న తాళాన్ని చూడగానే గుండె ఝల్లుమంది-

కొంపదీసి వీళ్ళు నాకోసమే వెళ్ళ లేదు కదా?

రకరకాల ఆలోచనల్తో వెనుదిరిగాను.

"ఏయ్ రఘూ....!" వెనుకనించీ వచ్చిన కేకతో అడుగు ముందుకు పడలేదు.

చటుక్కున వెనక్కి తిరిగాను.....

వాళ్ళ పక్క వాటాలోంచి బయటికొచ్చాడు రావ్.

అదేమిటి! సాధారణంగా అతను వాళ్ళింటికి వెళ్ళడే! అదీ ఆదివారం నాడు - ఈ సమయానికి....!

ఆశ్చర్యాన్నించి తేరుకోకముందే అతను నన్ను చేరుకున్నాడు.

"ఇవిగో తాళం చెవులు నువ్వెళ్ళి లోపల కూర్చో.... నేనూ, శారదా మరో పదినిముషాల్లో వస్తాం....." తాళం చెవులు చేతిలో పెట్టాడు.

"శారదగారు కూడా వాళ్ళింట్లోనే వున్నారా......" ఆ విషయం అర్థమైపోతూనేవున్నా, ఎందుకక్కడ వున్నారు అని అడగలేక అలా అడిగాను.

"మా ఇంటాయన కూతురు కమలని నువ్వు చూసే ఉంటావ్.... ఆ అమ్మాయిని చూట్టానికి ఇవాళ ఎవరో వచ్చారు......"

"అయితే మీరెందుకు......"

"ఈ విషయాల్లో ఆయనకి ఎవరైనా తోడు వుంటే బావుండుననిపించినట్లుంది. నన్ను రమ్మన్నాడు..... మేమో పదినిముషాల్లో వచ్చేస్తాము. నువ్వింట్లోకి వెళ్ళు...." ఎంత త్వరగా వచ్చాడో అంత త్వరగాను తిరిగి పక్క వాటాలోకి వెళ్ళిపోయాడు.

ఇక చేసేది లేక నెమ్మదిగా రావ్ ఇంటి తాళం తీసి, లోపల పడకకుర్చీలో కూలబడ్డాను.

ఈ పెళ్ళిచూపుల తతంగంమీద నాకే మాత్రం మంచి అభిప్రాయం లేదు.

ఎవరెవరో వస్తారు. నఖశిఖ పర్యంతం ఆ ఆడపిల్లని పరీక్షిస్తారు. అన్నిటినీ భరిస్తూ ప్రాణం లేని వస్తువులా పడుండాల్సిందే ఆడపిల్ల! ఆమె అభిప్రాయాల్ని గమనించే మనిషే వుండడు-చివరికి ఆ పిల్ల తండ్రి కూడా!

ఇంత తతంగం నడిచిన తర్వాత కూడా ముఖ్యమైన బేరం కుదరక పోయిందా..... గోవింద.....!

మళ్ళీ ఆ ఆడపిల్ల మరి కొంతమంది పరీక్షలకు గురి కావల్సిందే

పెళ్ళిచూపులు అయిందగ్గర్నుంచీ అతన్నే తన భర్తగా వూహించుకుని ఎన్నో కలలు కంటారు ఎంతో మంది ఆడపిల్లలు. తీరా అతను చేసుకోననేసరికి బలవంతాన ఆ కలలకి ఆనకట్టవేయాలి. తిరిగి మరో పెళ్ళికొడుకు.... మరి కొన్ని కలలు...

ఇలా ఆడపిల్లల్ని హింసించే మగవాళ్ళంటే వళ్ళుమంట నాకు. ఆ విషయం రావ్‌కి తెల్సు. తెలిసికూడా నేను వచ్చింతర్వాత కూడా రావ్

అలా పెళ్ళిచూపుల కార్యక్రమంలో మునిగిపోవడం ఏం నచ్చలేదు నాకు.

మరొకళ్ళూ మరొకళ్ళూ అయితే నేనంతగా పట్టించుకునేవాణ్ణి గాను. నాకు ఆత్మీయుడు, ఆదర్శ భావాలు గల వ్యక్తి అయిన రావ్ కూడా వాళ్ళింటాయన లాంటి వాళ్ళని ప్రోత్సహించడమేమిటి? ఈ విషయంలో నా నిరసనని రావ్ రాగానే చెప్పేయాలి.....

"ఏమిటోయ్.... మనుషులొచ్చింది కూడా గమనించకుండా తెగ ఆలోచించేస్తున్నావ్....!" నా ఆలోచనల్లో రావ్ వచ్చింది కూడా గమనించలేదు.

"అన్నయ్యా గారికి మనమీద కోపం వచ్చి ఉంటుంది" వెనకే వచ్చిన రావ్ భార్య శారద చిన్నగా నవ్వింది.

"అవును! వచ్చింది.... మీరు కూడా ఇలాంటి వాటిని ప్రోత్సహించడం నాకేమీ బావుండ లేదండీ....." శారద వంక చూస్తూ అన్నాను. ఎంత అణచుకోవాలని ప్రయత్నించినా కోపం గొంతులోంచి బయట పడనే పడింది.

ఆ తర్వాత ఆ విషయం మీద వాళ్ళకీ, నాకు మధ్య ఎంతో వివాదం నడిచింది. మామూలుకి భిన్నంగా ఆ రోజు కొంత అనీజీగా గడిచింది నాకు.

సరిగ్గా ఈ సంఘటన జరిగిన నెల రోజుల కనుకుంటాను-లంచవర్లో టీ తాగుతున్నప్పుడు "రేపాదివారం పది గంటలకల్లా నువ్వు మా ఇంటికి వస్తున్నావ్" రావ్ మాటలు వింతగా అనిపించాయి నాకు.

"ప్రతి ఆదివారం మీ ఇంటికి రావడం మామూలేగా! ఇవాళ మళ్ళీ ప్రత్యేకంగా చెప్పడం ఎందుకు"? అడిగాను అర్థంగాక.

"ఈసారి నువ్వు వచ్చేది ప్రత్యేకమైన హోదాలో....!"

"అంటే?"

"నువ్వు మా ఇంటికి వస్తుంటే నిన్నెన్నో సార్లు చూసాడు మా ఇంటాయన. వాళ్ళమ్మాయి కమలకి నీ సంబంధమైతే బావుంటుందని ఆయన ఆశ. అందుకని నిన్నెలాగైనా వప్పించి రేపాదివారం పెళ్ళిచూపులు ఏర్పాటు చేయమని ఎంతగానో ప్రాధేయపడ్డాడు......"

రావ్ మాటలకి కొరడాతో వీపుమీద కొట్టినట్లు వులిక్కిపడ్డాను.

వళ్ళు మండిపోయింది.

నాకి పెళ్ళిచూపుల భాగోతం అంటే చిరాకనే విషయం అతనికి తెలుసు. పైగా వాళ్ళింటాయన కూతురు పెళ్ళిచూపుల విషయంలోనే ఒకసారి మా ఇద్దరి మధ్య స్పర్థ వచ్చింది. ఈ విషయాలన్నీ మరిచిపోయి రావ్ నన్ను పెళ్ళి చూపులకి పిలవడం ఆశ్చర్యంతో పాటు కోపాన్నీ కలిగించింది. వెంటనే ఆ కోపాన్ని మాటల ద్వారా వెళ్ళగక్కేశాను.

"నాకి పెళ్ళి చూపులంటే సదభిప్రాయం లేదనే విషయం నీకు తెల్సు అయినా నువ్వు నన్నిలా పిలవడంలో అర్థంలేదు...."

నా మాటలు రావ్‌ని బాధించినట్టున్నాయి. అతను మారు మాట్లాడలేదు.

రావే బిల్ చెల్లించాడు. ఇద్దరం రోడ్డు మీద కొచ్చాం. నెమ్మదిగా ఆఫీస్ వేపు నడక సాగించాం.

అతను మౌనం.....

నాకూ కల్పించుకుని మాట్లాడాలనిపించలేదు.

నిశ్శబ్దం.....

రోడ్డు రకరకాల శబ్దాలతో మారు మోగుతున్నా మా ఇద్దరి మధ్యా నిశ్శబ్దం...

దూరం తరిగిపోతోంది.....

ఆ నిశ్శబ్దం మా ఇద్దరి మధ్యా దూరాన్ని పెంచుతోందేమో ననిపించింది హఠాత్తుగా.

వెంటనే "రావ్...." పలకరించాను.

రావ్ జవాబియ్యలేదు.

మళ్ళీ పిల్చాను.

జవాబు లేదు.

దాంతో అతనికి కోపం వచ్చిందేమోననే అనుమానం వచ్చి మొహం కేసి చూశాను.

ఆ పక్కనే ఉన్న బస్ స్టాప్‌కేసి చూస్తున్నాడు. నా కళ్ళూ అటు తిరిగాయి.

అక్కడో పదహారేళ్ళ పడుచు నిలబడుంది. అప్పుడే విచ్చుకుంటున్న పువ్వులా ఉన్న ఆమె అందం ఎవరినైనా ఆకర్షించి తీరుతుంది. తను తొడుక్కున్న పంజాబీ డ్రస్‌లో ఆమె అందం మరింత విజృంభించింది. చేతిలోని పుస్తకాల్ని తన అందాలు ఎవరికీ కనబడ కూడదన్నట్టు గుండెలకి అడ్డం పెట్టుకుంది.

"ఆ అమ్మాయి చాలా బావుంది కదూ....." అన్నా నప్రయత్నంగా.

దానికీ జవాబియ్యలేదు రావ్.

"ఇట్లాంటి ఆడపిల్లల్ని చూస్తే ఎవరికయినా మతిపోతుంది తప్పదు....." మళ్ళీ నేనే అన్నాను.

అది విన్నట్టులేదు రావ్.

ఆ అమ్మాయి వంకే చూస్తూ "మరో నాల్గయిదేళ్ళు పోతే మా పెద్దమ్మాయీ ఇలానే స్కూల్‌కి బయల్దేరుతుందేమో...." అన్నాడు.

ఉలిక్కిపడ్డాను.

ఇద్దరం మగవాళ్ళమే-కాకపోతే వయసులో కొద్దిగా తేడా. అంతే!

ఆ అమ్మాయిలోని యవ్వనాన్ని నేను వెదుకుతుంటే, కూతురితో పోల్చుకుంటూ అతను చూస్తున్నాడు.

నా ఆలోచన నాకే సిగ్గనిపించింది.

రావ్ నా మాటల్ని వినలేదు కాబట్టి సరిపోయింది. వింటే ఎంత నీచంగా అనుకునేవాడో....

వెంటనే నా అంతరాత్మ అందుకు ఎగురు తిరిగింది.

ఎందుకు అసహ్యించుకుంటాడు? అతనికి పెరుగుతున్న ఆడపిల్లలున్నారు కాబట్టి అందరి ఆడపిల్లల్లోను అతను కూతుళ్ళనే చూసుకోగలడు-మరి నేనో...... పెళ్ళి కావలసిన వాణ్ణి. అందుకే కనిపించిన ప్రతి ఆడపిల్లలోనూ అందాలు వెదుక్కుంటున్నాను...... అందులో తప్పేం లేదు. తప్పు వయసుదే!

వెంటనే రావ్ వాళ్ళింటాయన గుర్తుకొచ్చాడు. ఆయన కూతురుకి పెళ్ళి చెయ్యాలి. అందుకనే కాస్త యోగ్యతున్న యువకుడు కనిపించగానే అల్లుడవు తాడేమోననే ఆశతో పెళ్ళి చూపులకు పిలుస్తున్నాడు-అందులో అతనిదీ తప్పులేదు.

"రావ్... రేపాదివారం నువ్వు చెప్పినట్టుగానే పెళ్ళి చూపులకు వస్తున్నాను. ఆ విషయాన్ని ఆయనకి తెలియజెయ్....." అన్నాను వెంటనే.

ఇందాక పెళ్ళిచూపుల పేరెత్తగానే అంతగా చికాకు పడిపోయిన నేనేనా వెంటనే ఇలా మాట్లాడింది అనిపించినట్టుంది అతనికి!

నామొహం కేసి ఆశ్చర్యంగా చూశాడు.

ఠక్కున తలకిందికి దించాను. "నేనేదో బాధపడతానని నువ్వు రావద్దు...." ఆఫీస్ మెట్లెక్కుతూ అన్నాడు రావ్.

"నీకోసం వస్తానని నేనేమీ అనడంలేదు, మనస్ఫూర్తిగా రావాలనిపించే చెప్తున్నాను. కాకపోతే హడావిడి పడి పెద్దగా ఏర్పాట్లు మాత్రం చేయవద్దని చెప్పు.... మళ్ళీ కలుస్తా...." గబగబా నా సీట్ వేపు అడుగులు వేశాను. ☆

(జ్యోతి మాస పత్రిక - సెప్టెంబరు 1981)

# వయసు వ్యాపారం

ఇల్లు దగ్గరవుతున్న కొద్దీ అడుగులు త్వరత్వరగా పడసాగాయ్. ఇవాళ ధైర్యంగా ఇంట్లోకి అడుగు పెట్టవచ్చు.

వెళ్ళి వెళ్ళగానే వందరూపాయల నోటు మొదకిసిరేస్తే సరి - ఉమ నోరు కట్టేసుకుపోతుంది. మరికొన్ని రోజులు ఇలా కష్టపడితే పెరుగుతున్న వయసుని దాచుకోడానికి కష్టపడే పెద్దదానికి గుడ్డలేకాదు, పిల్లలందరికీ ఏది కావాలంటే అది కొనివ్వగల్ను! వా పిల్లలూ అందరి పిల్లలలాగానే దర్జాగా తయారై, ఆనందంగా తిరగాలని నాకు మాత్రం వుండదూ?

పిల్లల విషయంలో ప్రేమంతా తనకే వున్నట్లు, నేనేమీ పట్టించుకోనట్లు మాట్లాడుతుంది ఉమ. అది దాని తప్పుకాదు. పరిస్థితుల తప్పు!

అయినా గుమాస్తాగాణ్ణి నాకు పెళ్ళెందుకు? ఏం పాముకుందామని చేసుకున్నాను? అనవసరంగా మరో ప్రాణిని కూడా నరకంలోకి లాగాను. అంతటితో వూరుకున్నామా?

ఉహూ-మరి కొంతమందిని పిల్లలరూపంలో నరకంలోకి లాక్కొచ్చాం. నా పిల్లలుగా పుట్టి వాళ్ళేం సుఖపడ్డారు? కాదు-ఏ కష్టం పడ్డారు?

మరో రెండు రోజులుపోతే-వాళ్ళూ, భార్యలాగానే బయటపడిపోతారు. నా అసహాయతకు సానుభూతి చూపించరు సరికదా-అసహ్యించుకుంటారు.

ఆ పరిస్థితి రాకుండా చూసుకోవాలి.

ఎలా? ఏం చేయాలి?

'ఇంకా ఎలా సంపాదించాలి?' అని బుర్ర బద్దలు కొట్టుకుంటున్న సమయంలో రవి అప్పుడులా కనిపించాడు. కనిపించడమే కాదు-అభయమిచ్చాడు. తను కోరినట్టు కథలు రాసిస్తే కనీసం రెండు వందలయినా నెలకు ముట్టచెప్తానన్నాడు. నాకు కావలసింది డబ్బు. అతనికి కావలసింది పచ్చి శృంగార కథలు!

ఈ మధ్య నాలో వున్న రచయిత నాకెట్లాగూ వుపయోగపడడంలేదు. వాడ్ని ఈ విధంగా వుపయోగించుకుంటే మాత్రం తప్పేమిటి?

వెంటనే వప్పేసుకున్నాను.

అక్కడికక్కడే కూర్చుని పచ్చి పదజాలాన్నంతా ఏర్చి కూర్చి అయిదు కథల రూపంలోకి మార్చి అతనికిచ్చేసి వచ్చాను.

"ఆ పుస్తకం మార్కెట్‌లో వచ్చీ రాక ముందే అమ్ముడైపోయింది. ఇప్పుడు మనక్కావాలన్నా ఒక్క కాపీ దొరకదు. ఇవాళ రాత్రికి నువ్వు మా ఇంటికి వచ్చి కూర్చుని మరో సెట్ రాసివ్వు. వెంటనే పబ్లిష్ చేసేద్దాం. వేడిలో వేడి - ఇటువంటప్పుడే మన సామర్థ్యాన్నంతటినీ సొమ్ము చేసేసుకోవాలి. ఈ సారి క్రిందటిసారిలా పుస్తకం విడుదలయ్యేంతవరకూ కాకుండా, నువ్వు కథలు రాసివ్వగానే డబ్బులిచ్చేస్తాను అన్నాడు. పొద్దున రవి ఆఫీసుకొచ్చి మొదట రాసిన కథల తాలూకు వందరూపాయలనిస్తూ.

అతని మాటలు విన్నప్పుడు కూడా బయటపడని ఉత్సాహం వంద కాగితాన్ని చూడగానే పెల్లుబికి రాసాగింది. వెంటనే ఆఫీసుకి శలవు పెట్టి రవిక్కావలసిన కథలని అర్జంటుగా రాసిచ్చేద్దామనుకున్నాను. కానీ, డబ్బుమనిషిగా అతని ముందు

అంతలా బయటపడడం ఇష్టంలేక, బలవంతాన ఆ కోరిక నణచుకున్నాను.

"రాత్రి భోజనాలయింతర్వాత మీ ఇంటికి వస్తాను. అప్పుడు కూర్చుందాం" అన్నాను.

అనుకోకుండా ఆఫీస్‌లో అర్జంట్ పని తగలడంతో ఆలశ్యమైపోయింది. ఇంటికి వెళ్ళి వెళ్ళకముందే గబగబా భోంచేసి రవి వాళ్ళింటికి వెళ్ళాలి. ఇప్పటికే నేను రాలేదని అతను కంగారు పడుతుంటాడు. వీలైతే ఇవాళ రెండు పుస్తకాలకు సరిపడా కథలు రాసివ్వాలి.

మంచి కథలు రాయాలంటే ఆలోచించాలి కాని, ఇటువంటి కథలు రాయాలంటే ఎందుకు? ఓపికుండాలేగాని ఎన్ని కథలయినా వరుసబెట్టి రాసిచ్చేయచ్చు!

మనసానందంతో నిండిపోయింది. రకరకాల ఆలోచనల్తో ఇల్లు చేరుకున్నాను. నేననుకున్నట్లు ఉమ వరండాలో ఎదురవ్వలేదు. వంటింట్లోంచి అరుపులు వినబడుతున్నాయ్!

నేను వచ్చినట్లు చంటాడు లోపలికిపోయి చెప్పినట్లున్నాడు - చేతిలో గరిటతో సర్రున దూసుకొచ్చింది. "వాళ్ళవర్నీ కాదు అసలు మిమ్మల్నననాలి" అంటూ.

ఇంట్లోకి అడుగుపెట్టీ పెట్టగానే ఉమ ఎదురొస్తుంది. చటుక్కున దానికి వందరూపాయల కాగితాన్నందిస్తాడు తను. ఆ కాగితాన్ని చూడగానే ఆమె మొహం ఆనందంతో వెలిగిపోతుంది....' ఇలా ఎన్నో రకాలుగా వూహించుకుంటూ వచ్చిన నాకు ఉమ అపరకాళిలా దర్శనమిచ్చేసరికి వళ్ళు మండిపోయింది. కోపాన్ని నిగ్రహించుకో లేక పోయాను.

"ఏమిటీ? ఏమైందీ? ఇంట్లోకి వచ్చీ రాకముందే ఏమిటా గావుకేకలు?" నాకు తెలీకుండానే నా కంఠంలో కోపం ప్రతిధ్వనించింది.

"ఏమైందా? దానికి పాతికేళ్ళు వస్తున్నాయి సంబంధాలు చూడండీ అంటూ నెత్తీ నోరు బాదుకున్నా వినిపించుకోరు."

గుండెలు గుభేలుమన్నాయ్! 'కొంపదీసి..... అమ్మో!? మనసు మొద్దుబారిపోతోంది.

"అబ్బబ్బ! నీ సాధింపులు కాసేపు కట్టిపెట్టి అసలేమి జరిగిందో చెప్పు?" అడిగాను కంగారుగా.

"ఇంకా ఏం కావాలి? అయినా, అయిన తర్వాత ఏం చేయగలం గనుక? చంటిది గుక్కపట్టి ఏడుస్తున్నా పట్టించుకోకుండా గదిలో ఏం చేస్తోందో అని వచ్చేసరికి ఇదిగో, ఈ ప్రేమలేఖ చదువుకుంటోంది.. ఎవడో దీని క్లాసేనట! దీన్ని రేపు సాయంత్రం సినిమా హాల్లో కలుసుకోమంటూ రాశాడు. నన్ను చూడగానే వుత్తరాన్ని టకీమని దిండు కిందకు తోసేసింది. నేను తలగడ తీసి చూసేసరికి ఈ ఉత్తరమే కాదు - దీన్నిలాంటి పాడు పన్లకు పులిగొల్పే ఈ బూతుల పుస్తకం కూడా వుంది. డబ్బు కోసం గడ్డి తినే నీచమయిన వెధవలు ఇలాంటి పుస్తకాలు రాస్తే, ఆ చెత్త చదివి ఇదిలా తయారైంది."

నివ్వెరపోతూ ఆ పుస్తకం, అందులో వున్న ప్రేమలేఖ తీసుకొని చూశాను. కళ్ళు గిర్రున తిరిగాయ్. ఆ బూతు పుస్తకం రాసింది కాదు - నేను రాసిందే!

డబ్బుకోసం గడ్డితిని నేనా పుస్తకం రాస్తే, ఆ డబ్బుకోసమే గడ్డితిని రవి దాన్నచ్చువేశాడు. అన్నెం పున్నెం తెలీని అమాయకులు ఆ మాయలో పడి కొట్టుకుపోతున్నారు. ఇప్పుడా పుస్తకం తాలూకు చెడు ప్రభావం నా కుటుంబం మీదే పడుంది.

నేను బూతు కథలు రాయడంలో లేని తప్పు. అది చదవగా ఏమొచ్చింది?

ఆ లేత మనసులో విపరీతమైన ఆలోచనలకు బీజం వేసింది ఎవరు?

కన్నతండ్రే!

ఈ విషయం తెలిస్తే ఉమ నన్ను క్షమిస్తుందా? అలాంటి పుస్తకాలు రాసి సంపాదించిన డబ్బే తనకివ్వబోతున్నానని తెలిసి ఎంత చీదరించుకుంటుంది? ఆ క్షణంలో నా జేబులోని వంద రూపాయల కాగితం విషసర్పంలా కదులుతున్నట్లనిపించింది. యవ్వన బలహీనతలకి లోబడకుండా పిల్లలను హెచ్చరించాల్సిందిపోయి, వారి వయసు బలహీనతల్తో వ్యాపారం చేస్తున్నాను.

లక్ష్మి వణికిపోతూ నా ముందు నిల్చుంది. నేనేమంటానో, ఎలా శిక్షిస్తానో అని ప్రాణాలు కళ్ళలో పెట్టుకొని చూస్తోంది. తండ్రినయినా ఆమెను శిక్షించే హక్కు నైతికంగా నాకెక్కడుంది? దోషిలా తలవంచుకుని బయటికొచ్చేశాను ఆ గదిలోంచి.

బయట రవి నిలబడున్నాడు.

నేను రావడం ఆలస్యమయిందని నన్ను పిలవడానికి తనే వచ్చినట్టున్నాడు.

"వెళ్దామా మా ఇంటికి?"నన్ను చూసి నవ్వుతూ అడిగాడు.

అతని నవ్వు నన్ను అపహాస్యం చేస్తున్నట్లనిపించింది. "సారీరా! ఇదిగో పొద్దున నువ్విచ్చిన వందరూపాయలు. ఇక నుంచీ అలాంటి కథలు రాయదల్చుకోలేదు. నీకు నమస్కారం చేస్తాను డబ్బుకోసం ప్రచురించి అమాయకులయిన యువతీ యువకులను తప్పుదారి పట్టించకు."

రవి మాట్లాడలేదు. నవ్వి వెళ్ళిపోయాడు.

అవును! నేను కాకపోతే డబ్బు కోసం గడ్డితినే మరో రచయిత దొరకకపోడు అతనికి! ★

(విజయ మాసపత్రిక - ఫిబ్రవరి 1979)

# వయసు వేడి

రంగనాథ్ మనసు మాటలలోను, వాక్యాలలోను వర్ణించలేని వింత అనుభూతికి లోనవుతోంది.

ఇంతవరకూ ఎన్నో సినిమాల్లో చూసాడు ఎన్నో కథల్లో చదివాడూ మొదటి రాత్రి గురించి! ఇప్పుడు తను చవి చూడబోతున్నాడు!!

ఆ అనుభూతి తాలూకు ఆలోచన్లు అతని మనసులో తియ్యటి బాధనికలిగిస్తున్నాయి.

వంటింట్లో శాంత పని ఇంకా పూర్తి కాలేదన్నట్లు గిన్నెల శబ్దాలు వినిపిస్తున్నాయి.

'ఇదే సినిమాలో అయితే వెంటనే హీరోగారు వెనగ్గా వెళ్ళి హీరోయిన్ని వాటేసుకుంటారు. వంటిల్లుని వదిలి పెట్టి ఇద్దరూ పెరట్లోకో, డాబా మీదకో వెళ్ళి ఎంచక్కా డూయెట్లు పాడేసుకుంటారు' నవ్వొచ్చింది రంగనాథ్‌కి. పెరట్లోకిగాని, డాబామీదకి కాని తామిద్దరూ ఇప్పుడు పరుగెత్తి పాటలు పాడడం ప్రారంభించారంటే పిచ్చెక్కిందేమో ననుకుంటారు చుట్టుపక్కలవాళ్ళు.

చుట్టుపక్కల వాళ్ళదాకా ఎందుకూ తనలా ప్రవర్తిస్తే పిచ్చెక్కిందేమోనని శాంతే బెదిరిపోతుంది. అందుకనే బుద్ధిగా కుర్చీలో కూర్చుని, చేతికి అందిన ఓ వారపత్రికని తీసుకుని తిరగవేయసాగాడు. కళ్ళు పేజీల వెంట పరుగెడుతున్నా మనసు మాత్రం అనుభవించబోయే తియ్యటి అనుభూతి గురించే కలలు కనసాగింది.

విసుగ్గా పుస్తకాన్ని పక్కన పారేసి కుర్చీలో వెనక్కి వాలాడు.

శాంత! పేరుకు తగ్గ శాంత స్వభావురాలే కాదు మంచి అందగత్తె కూడా! అందుకే చూడగానే వప్పేసుకున్నాడు. పెళ్ళి చేసేసుకున్నాడు.

ఇప్పుడామె తన అర్ధాంగి!

ఎదురుగా అపురూపమైన భార్యని పెట్టుకుని దూరం దూరంగా తిరగడం ఎంతో కష్టం. అందుకని పెళ్ళి అయిపోగానే శలవు లేదంటూ, పెద్దల్ని వప్పించి వెంట తీసుకొచ్చేసాడు శాంతని.

ఇంకా దాదాపు ఇరవై రోజుల శలవుంది. ఈ ఇరవై రోజులూ ఇద్దరూ ఆనందంగా గడిపేయాలి.

ఈ విషయం ఇంకా శాంతకి కూడా చెప్పలేదు! ఏదీ చెప్పే అవకాశం తనకి ఎక్కడిచ్చింది? వచ్చినప్పటి నుంచీ ఇల్లు సర్దడంలోనే మునిగిపోయింది ఆ సర్దుడు కార్యక్రమం పూర్తికాగానే స్నానాలు, భోజనాలు..... ఇక ఏకాంతం దొరుకుతుంది గదా అనుకుంటే మళ్ళీ వంటింట్లో సర్దుడు మొదలు......

"మీరు వెళ్ళి పడుకోండి. నేనీ వంటిల్లు సర్ది వస్తాను" అని భోజనం కాగానే ఆర్డర్ జారీ చేసింది. తప్పక తనిలా వచ్చి కూలబడ్డాడు.

"ఏమిటీ తెగ ఆలోచిస్తున్నారు" మరచెంబుతో నీళ్లని తీసుకొచ్చింది శాంత.

"అబ్బే... ఏంలేదు...." ఆలోచనల్లోంచి బయట పడ్డాడు రంగనాథ్.

చిన్నగా నవ్వి "ఇప్పుడే వస్తా" అంటూ మళ్ళీ వంటింటి వేపు వెళ్ళిపోయింది శాంత.

రంగనాథ్‌కి తనమీద తనకే విపరీతమైన చిరాకు వేసింది.

శాంత లోపలికి రాగానే సినిమా హీరోలా అమాంతంగా దగ్గరకి తీసుకోలేకపోయినా కనీసం సరదాగా అయినా ఎందుకు మాట్లాడలేకపోయానా అని బాధ పడ్డాడు.

అందమైన ఆమె మొహం చూసేసరికి ఆనందంతో పాటు ఓ విధమైన తత్తరపాటు కూడా కలిగింది. ఏమి మాట్లాడితే ఆమె ఎలా అర్థం చేసుకుంటుందో ననే భయం కలిగింది. అందుకే అలా అయిపోయాడు తను.

ఆమె ఎవరు?

తన భార్య!

అయినా తనిలా ఎందుకైపోయాడు?

ఆమే ఇలాంటి అనుభూతులకి లోనవుతూనే వుంటుందా? ముందసలు ఒకళ్ళ గురించి మరొకళ్ళకి పూర్తి అవగాహన వుండాలి. అప్పుడు పొరబాటున కూడా అపార్థాలు కలగడానికి అవకాశముండదు. రంగనాధ్ తిరిగి ఆలోచనల్లో మునిగిపోయాడు.

తామిద్దరి మధ్యా అసలు రహస్యాలు అంటూ వుండకూడదు. ఒకళ్ళకి బాధ కలిగించే విధంగా మరొకళ్ళు పొరబాటున కూడా ప్రవర్తించకూడదు. ఒకళ్ళ కోసం మరొకళ్ళు అడ్జస్ట్ అయిపోవడం నేర్చుకోవాలి.

తామిద్దరి మధ్యా బంధం ఎలా వుండాలి అని ఆలోచించసాగాడు. ఆఖరికి ఆమె రాగానే కాసేపు కూర్చోబెట్టి తన గురించి వివరాలన్నీ ఆమెకి చెప్పాలని కూడా నిశ్చయించుకున్నాడు.

ముందుగా చెప్పాల్సింది రాణి గురించి! ఆమె తన మేనత్త కూతురు కావడంతో చిన్నప్పటి నుంచే అందరూ తామిద్దర్నీ మొగుడు పెళ్ళాలుగా చూసేవారు. ఆ మాటలకి అర్థాలు తెలీని చిన్న వయసులో

నిజంగానే తామిద్దరూ ఎంతో అన్యోన్యంగా వుండేవాళ్ళు. కలిసే ఆడుకుంటూండేవాళ్ళు. కలిసే స్కూలుకి వెళ్ళేవాళ్ళు!

కానీ తమ వయసుతో పాటు పెద్దల మధ్య విరోధం కూడా పెరగసాగింది. అఖరికి ఆ ఇంటి మీద కాకి ఈ ఇంటి మీద వాలగూడని స్థితికి వచ్చారు.

ఏ పెద్దలయితే తమ మాటలతో ఇద్దర్నీ దగ్గరికి చేర్చారో ఆ పెద్దలే తమ కక్షలతో ఇద్దర్నీ దూరం చేసేశారు.

ఒకరోజు ఇద్దరూ మాట్లాడుకుంటూ ఓ రోడ్డుమీద దొరికి పోయారు మామయ్యకి. ఇంటికి వెళ్లిన తర్వాత నానా హింసా పెట్టాడట రాణిని. అంతటితో వూరుకోకుండా అర్జంటుగా ఆమెకి సంబంధాలు చూడడం ప్రారంభించాడు. ఆరునెలలు కూడా తిరక్కుండానే ఆమెకి బలవంతాన పెళ్ళి చేసేసారు.

మరో మూడు నెలలు తిరక్కుండానే తన పెళ్లి అయిపోయింది?

ఈ విషయం శాంతకి చెప్పాలి. తామిద్దరి మధ్యా కేవలం స్నేహం తప్ప మరే చొరవా లేదని చెప్పాలి. ఎప్పుడైతే ఆమెకి పెళ్ళయిందో అప్పుడే ఆమెని మనసునించీ పూర్తిగా తొలగించేసానని కూడా చెప్పాలి. అంతేకాదు ఇప్పుడు పెళ్ళికావడంతో నా మనసంతా నువ్వే ఆక్రమించేసావనీచెప్పాలి.....?

తలుపులు దగ్గరకి వేసిన శబ్దం అవడంతో ఆలోచనల్లోంచీ వులిక్కిపడి బయటకొచ్చాడు రంగనాథ్. సిగ్గుతో తలవంచుకుని తలుపుల దగ్గర నిలబడ్డ శాంతని పొదివి పట్టుకుని తీసుకొచ్చి మంచం మీద తన పక్కన కూర్చోబెట్టుకున్నాడు.

"శాంతా! మనిద్దరి మధ్యా అసలు దాపరికాలు అంటూ వుండకూడదు. ఒకరి గురించి మరొకరికి క్షుణ్ణంగా తెలియాలి. అప్పుడు

ఎటువంటి అపార్థాలకీ తావుండదు." తాను చెప్పదలచుకున్న దానికి ఉపోద్ఘాతంగా అన్నాడు రంగనాధ్.

దెబ్బతిన్న పిట్టలా చూసింది శాంత.

"అబ్బే.... నన్ను నువ్వు అపార్థం చేసుకోకు. కొన్ని కొన్ని విషయాలు మనకి ఒకళ్ళ నుంచీ మరొకళ్ళకి తెలిస్తే అంతగా బాధనిపించదు. అదే మూడో మనిషి ద్వారా వింటే బావుండదు...... తన మాటల్ని ఆమె ఎలా అర్థం చేసుకుంటోందో అని కంగారు పడ్డాడు రంగనాధ్.

ఆమె మొహంలో అంతే కంగారు చోటు చేసుకుంది. బెదురు చూపులు చూడసాగింది.

"ప్రతి మనిషి నా అంచనా ప్రకారం యవ్వనంలోకి అడుగు పెట్టగానే ప్రేమ తాలూకు రకరకాల ఆలోచనలతో సతమతమైపోతాడు. పరిస్థితులు అనుకూలించాయంటే బయట కూడా పడిపోతాడు. వయసు వేడి అటువంటిది! కొంతమంది బయటపడితే, మరి కొంతమంది ఆ ఆలోచనలని తమ మనసులోనే అణగదొక్కేసుకుంటారు. 'ప్రేమ' తాలూకు ఆలోచనలని ప్రతి మనిషి యవ్వనంలోకి అడుగు పెట్టగానే చవి చూస్తాడు. శారీరకంగా మలినం కానంతవరకూ తప్పులేదు...." ఒక్క క్షణం ఆపి శాంత మొహంలోకి చూసాడు రంగనాధ్.

ఆమె మొహం పూర్తిగా కిందకి వాలిపోయింది. తన ఉపోద్ఘాతాన్ని ఆమె సరిగ్గా అర్థం చేసుకుంటోందంటే అప్పుడు రాణి గురించి కూడా చెప్పేయాలని అతని ఆలోచన.

కానీ ఆమె అలా మొహం కిందకి వాల్చేసరికి అతనికి కొద్దిగా భయం కలిగింది. ఆమె తనని అపార్థం చేసుకుంటోందేమోనని! అందుకే ఒక్క క్షణం వూరుకున్నాడు.

శాంత మనసు రకరకాల భయాలతో కొట్టుకుంటోంది. కాలేజీలో చదువుకునేప్పుడు రాజారావ్ అంటే తనకి, తనంటే రాజారావ్‌కి ఓ విధమైన ఇష్టం వుండేది. పెళ్ళి కూడా చేసుకోవాలనుకున్నారు. కానీ కొన్ని పరిస్థితుల వల్ల తామిద్దరి పెళ్ళి జరగలేదు. ఈ విషయాల్ని పెళ్ళికి ముందే చెప్పాలనుకుంది కానీ అవకాశం దొరకలేదు. ఈ విషయాలన్నీ తెలిసుంటాయి. అందుకే ఇలా మాట్లాడుతున్నారు. వెంటనే వివరంగా అన్ని విషయాలూ చెప్పేయాలి. తామిద్దరి మధ్య అప్పట్లో కేవలం వయసు ఆకర్షణే తప్ప మరేటువంటి చనువు, చొరవ లేదని చెప్పాలి.

"ఈ విషయం మీతో నేను ఎప్పుడో చెప్పాలనుకున్నాను......" నెమ్మదిగా అంది శాంత.

ఆమె అలా అనేసరికి తను చెప్పదలచుకున్న విషయాన్ని మరచి అయోమయంగా చూడసాగాడు రంగనాధ్.

మీరన్నట్లు వయసు వేడిలో రకరకాల ఆలోచనలు వస్తుంటాయి. అది ఆ వయసు తప్పు. శారీరకంగా తప్పు చేయనంత వరకూ పర్లేదు అనే అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తాను... అప్పట్లో కాలేజీలో అందరికన్న తెలివైన విద్యార్థి రాజారావ్. అందుకే అతనంటే ఓ విధమైన ఆకర్షణ వుండేది. అప్పట్లో దాన్ని ప్రేమ అనుకునే దాన్ని..... కానీ కాదనే విషయం నాకు ఇప్పుడు తెలుసు.....!"

అంతే! నెత్తిన ఎవరో కర్రతో గట్టిగా కొట్టినట్లనిపించింది రంగనాధ్‌కి. అంటే శాంత మనసులో తనకన్నా ముందర మరో వ్యక్తి చోటు చేసుకున్నాడన్న మాట. శాంత తన సొంతం అనుకున్నాడు. శాంత కూడా ఇటువంటిది అనుకోలేదు..... ఛీ.... ఛీ...

ఇప్పుడతని మనసులో శాంత మీద ఓ వ్యతిరేక భావం చోటు చేసుకుంది. ఇందాకటి అతని ఆలోచనలన్నీ ఆ అనుమానం కింద మరుగునపడినలిగిపోయాయి.

*

# వయసుకి కళ్ళెం

రకరకాల వాహనాలతోను, మనుషులతోను కోఠీ సెంటర్ గజిబిజిగా వుంది. అక్కడ నడుస్తున్న శంకర్ మనసు అంతకన్నా గజిబిజిగా వుంది.

మూడు సంవత్సరాలలోనే ఎంత మార్పు!

అప్పుడు ఈ బజార్లన్నీ తెగ తిరిగేవాడు, ఇప్పుడూ తిరుగుతున్నాడు. అప్పటికి, ఇప్పటికి ఎంత తేడా! ఆశ్చర్యం వేసింది శంకర్‌కి.

ఆ రోజుల్లో తన వెంట ఎప్పుడూ నలుగురయినా వుండేవారు. అందరూ కలసి ఆనందంగా కబుర్లు చెప్పుకుంటూ, కనిపించిన అమ్మాయినల్లా అల్లరి చేస్తూ తిరిగేవారు. బాధ్యతలేని, తెలీని వయసది!

మరిప్పుడో?

కాలేజి వదిలేసి రెండు సంవత్సరాలు దాటినా వుద్యోగం సంపాదించుకోలేని అసమర్థుడని ముద్ర పడిపోయింది తనమీద. ఎన్ని ఉద్యోగాలకి అప్లికేషన్లు పెట్టాడో, ఎన్ని ఇంటర్వ్యూలకి వెళ్ళాడో లెక్కలేదు. తన మీద తనకే నమ్మకం లేకుండా పోతోంది. ఇక మిగతా వాళ్ళని ఎలా నమ్మించగలడు, తనకి వుద్యోగం వస్తుందని! మనసు నిండా అశాంతి.... నమ్ముకున్న వాళ్ళకి అశాంతి.....!

చదువయిపోయిన తర్వాత కూడా ఇంటర్వ్యూల సాకుతో ఇలా హైద్రాబాద్ రావడం, ఆ ఇంటర్వ్యూ కాస్తా అయిందనిపించడం, ఇలా కాసేపు రోడ్ల వెంట తిరిగి రాత్రి బండిలో తిరిగి తన వూరు వెళ్ళిపోవడం మామూలైపోయింది. పాత స్నేహితుల్ని ఎవర్నీ కూడా కలవాలనిపించలేదు. వాళ్ళలో చాలామంది ఉద్యోగస్థులైపోయారు....

ఎవర్ని చూసినా ఇదివరకటిలా హాయిగా మాట్లాడలేక పోతున్నాడు... అందుకే ఇలా తప్పించుకు తిరగడం.....!"

"శంకర్ గారూ...." తన పేరు చెవులని తాకడంతో ఆలోచన్లోంచి బయట పడ్డాడు శంకర్.

చుట్టూ చూశాడు. రోడ్డుకి అవతల కొంతమంది స్నేహితురాళ్ళతో మాట్లాడుతూ నిలుచున్న రాధ కనిపించింది. తన వేపె నవ్వుతూ చూస్తోంది. ఆమే పిలిచినట్లుంది....

తనతో వున్న వాళ్ళకి ఏదో చెప్పి గబగబా వస్తోంది. గుండెలు జారిపోయాయి శంకర్‌కి.

ఎవర్నికైతే ముఖ్యంగా కనిపించకూడదనుకుంటున్నాడో వాళ్ళే కనిపించారు....!

"మీరూ ఇక్కడే వుంటున్నారా?" నవ్వుతూ దగ్గరకి వచ్చింది.

"లేదండీ... ఈ రోజే వచ్చాను ఇక్కడికి...." తడబడ్డాడు శంకర్.

"భలేవాళ్ళే! ఆడవాళ్ళతో మాట్లాడడమే భయమున్నట్లు అలా వణికిపోతారేం! పదండి... అలా కామత్‌కి వెళ్ళి కాఫీ తాగుతూ మాట్లాడుకుందాం"

శంకర్ గొంతుకి పచ్చి వెలక్కాయ అడ్డం పడ్డట్లయింది.

"అర్జంటు పని మీద వెళ్తున్నానండీ.... మళ్ళీ రాత్రి బండిలో మావూరువెళ్ళిపోవాలి....."

"ఏమిటండి తెగ మొహమాట పడిపోతున్నారు. రెండు సంవత్సరాల తర్వాత కలుసుకున్నాం. కనీసం రెండు నిముషాలయినా మాట్లాడుకోవద్దూ?"

ముందు రాధ........

కొద్దిగా వెనగ్గా శంకర్....

హఠాత్తుగా అతనికి ఆరోజు గుర్తు కొచ్చింది.

ఇదే సెంటర్లో తను తన బృందంతో వెళ్తున్నాడు. కొద్ది దూరంలో ఒంటరిగా వెళ్తున్న రాధ కనిపించింది. అందరిలోనూ కొత్త వుత్సాహం ప్రవేశించింది.

"ఈ సెంటర్‌లో ఆమె తలమీద ముద్దు పెట్టుకుంటే ఎవరికైనా వందరూపాయలిస్తాను రాజశేఖరం అన్నాడు.

"ఈ సెంటర్‌లోనా! నీ వంద రూపాయలకోసం వళ్ళు హూనం చేసుకునే మూర్ఖుడెవ్వరూ లేరు" వెంటనే బదులిచ్చాడు భద్రం.

"నీతో ఎవరన్నారోయ్....."

"మరి ఎవరితో అన్నావుట......"

"శంకర్ లాంటి హీరోతో......"

అంతే! తనలో కొత్త ఉత్సాహం వురకలు వేసింది చటుక్కున భద్రం చేతిలోంచి సైకిల్ని లాక్కుని బయల్దేరాడు.

అందరూ విచిత్రంగా చూడసాగారు.

ఎవరూ వూహించని విధంగా తన సైకిల్ ముందుకు దూసుకుపోయింది. రాధ దగ్గరికి రాగానే సైకిల్ని స్లో చేసాడు.

సరిగ్గా పక్కకి రాగానే సైకిల్ మీద వుండే ఆమె తలని దగ్గరకి లాక్కుని చటుక్కున ముద్దు పెట్టుకోవడం, అంతకన్నా వేగంగా ముందుకు దూసుకు పోవడం క్షణాల్లో జరిగిపోయాయ్.

ఆ తర్వాత మరెన్నోసార్లు ఎన్నో విధాలుగా రాధని టీజ్ చేసాడు తను. ఒక్క రాధనే కాదు ఎంతో మంది ఆడపిల్లల్ని ఏడిపించాడు.

వాళ్లందరి వుసురూ తగిలి తనకి వుద్యోగం రావడం లేదు! నీరసంగా నిట్టూర్చాడు.

"ఏమిటి మాటా పలుకు లేకుండా మౌనంగా వున్నారు....!" కామత్ హోటల్ మెట్లెక్కుతూ చురుగ్గా చూసింది రాధ.

ఆ చూపుల చలాకీ తనానికి తట్టుకోలేక చటుక్కున తల వంచుకున్నాడు శంకర్.

"ఆడపిల్ల కనిపిస్తే చాలు కళ్ళునీళ్ళ పర్యంతమయ్యే వరకూ విడిచి పెట్టని తమరు ఇంత బుద్ధిమంతులెప్పుడయ్యారో......?" రాధ వెనకే ఫామిలీ రూమ్‌లోకి నడిచాడు శంకర్.

అతనికి చాలా ఇబ్బందిగా వుంది. కానీ ఆ విషయాన్ని ఆమెకి చెప్పలేదు. చెప్పినా వినిపించుకునే స్థితిలో లేదామె! అందుకే మౌనంగా అనుసరించడం తప్ప మరో గత్యంతరం లేదు.

"మీరు ఎక్కడ పని చేస్తున్నారు....?" ఆమె ఎదురుగా వున్న సీట్లో కూర్చుంటూ అడిగాడతను.

"హమ్మయ్య... ఇప్పటికి నోరు విప్పారన్నమాట! సంవత్సరమైంది, బాంక్‌లో గుమాస్తాగా జేరి..."

సర్వర్ రావడంతో రెండు కాఫీలు తెమ్మంది తనే!

"కాలేజీలో చదువుకుంటున్నప్పటి రోజులే వేరు.... ఎంతో సరదాగా వుండేది...... ఆఫీసులో అయితే పాలిటిక్స్‌మయం....."

క్రమంగా వాళ్ళ సంభాషణ కాలేజీ రోజుల వేపు మళ్ళింది. అప్పటి తన అల్లరిని ఆమె గుర్తు చేస్తున్న కొద్దీ అతను సిగ్గుతో కుచించుకుపోసాగాడు.

ఆనందంగా ఆమె కబుర్లు చెబుతోంది.

ఇబ్బందిగా అతను వింటున్నాడు.

"మరి బయల్దేరుదామా?" ఇబ్బందిగా కదిలాడు తను.

"మా ఇంటికి వెళ్దామా?" అడిగింది ఆమె. అతనితో ఏమేమో చెప్పాలనే ఆమె ఆరాటాన్ని అతని ప్రవర్తన నీరు కార్చేస్తోంది.

"ఈ సారి వచ్చినప్పుడు తప్పకుండా వస్తాను. ఇప్పుడు కొద్దిగా పనుంది...."

"ప్రామిస్...." చెయ్యి చాపింది ఆమె.

"ప్రామిస్....." ఆమె చేతిలో చెయ్యి వేసాడు.

చిన్నగా నవ్విందామె. సిగ్గుతో తలవంచుకున్నాడతను.

"మా బాంక్‌కి వచ్చారంటే ఇద్దరం కలిసి వెళ్ళవచ్చు...."

"అలాగే...."

ఇద్దరూ లేచారు.

బయటకు రాగానే ఆమె దగ్గర శలవు తీసుకుని వెళ్ళిపోయాడతను.

వెళ్తున్న అతని వంకే చూస్తూ నిలబడ్డ రాధ మనసులో రకరకాల ఆలోచనలు...

చదువుకునే రోజుల్లో తను చిలిపితనంతో చేసిన అల్లరి పనులు ఆమె మనసులో ముద్రించుకు పోయాయని, మొదటిసారి పురుషస్పర్శ రుచి చూపించిన తననే ఆమె ఇప్పటికీ కోరుకుంటోందని, అందుకే అతను కనిపించగానే ఆమె అంత ఆనందంగా ప్రవర్తించిందని అతనికితెలీదు.

వురకలు వేసే తన వయసు వుత్సాహానికి కళ్ళెం వేసిన తన నిరుద్యోగ పర్వం గురించి ఉద్యోగస్థురాలైన ఆమె ముందు చెప్పలేడు. చెప్తే ఆమెకు తన మీదున్న అభిప్రాయం ఎక్కడ చెడిపోతుందోనని భయం. అదీ కాకుండా ఇప్పటికీ ఆమెకు అపురూపంగా గుర్తున్న అప్పటి అల్లరి చేష్టలు గుర్తుకొస్తే అతనికి చిన్నతనంగా అనిపించసాగింది. అందుకే ఆమెతో మరికొంత సేపు గడపాలని మనసు వువ్విళ్ళూరుతున్నా వుండలేక అక్కడ నుంచి వెళ్ళిపోయాడు శంకర్.

*

(ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక 7-6-84)

# వయసు మత్తు!

ఎన్ని అర్జంటు పనులున్నా ఆఫీసునుంచి సరాసరి ఇంటికి వచ్చి ఫ్రెష్ అయిన తర్వాతే ఎక్కడికైనా వెళ్ళేది.

రూమ్‌కి చేరుకుని తలుపులు తీశాను.

గుమ్మం దగ్గర పడున్న ఉత్తరాన్ని చూడగానే అది ఎవరు రాసిందో అర్థమైపోయింది.

నాన్నగారు!

ఆయన ఏం రాస్తారో కూడా నాకు తెల్సు. అయినా ఆత్రంగానే ఉత్తరాన్ని చించాను.

డియర్ బాబు-

ఇంతకాలం సరైన ఉద్యోగం లేదు కాబట్టి మేమూ అంతగా పట్టించుకోలేదు ఒక్కడివే వుండడం నీకూ ఇబ్బందే! చిన్న పిల్లాడివి కాదు. ఇరవై అయిదు సంవత్సరాలు నిండిన వాడివి. నీకు ఇంతగా చెప్పనక్కర్లేదు. ఎన్నో సంబంధాలు వస్తున్నాయి. సాధ్యమైనంత త్వరలో నువ్వు శలవు పెట్టి, వస్తే నీ అభిప్రాయాన్ని బట్టి ఏదో ఒక సంబంధాన్ని ఫిక్స్ చేసుకోవచ్చుని నా అభిప్రాయం. మీ అమ్మ కూడా ఇదే అభిప్రాయాన్ని రాయమంది. కాబట్టి వెంటనే నువ్వు ఎప్పుడు వచ్చేది రాయవలసింది.

ఎప్పుడూ పెళ్ళి.... పెళ్ళి.... పెళ్ళి....!

ఉద్యోగం రావడం ఆలశ్యం ఇదే పాట!

అసలు ఈ పెద్దవాళ్ళకి వాళ్ళ ఆలోచనలు వాళ్ళవేగాని పిల్లల్ని సంప్రదించాలనే వుండదు. కొన్నాళ్ళపాటైనా హాయిగా వుండనీయకుండా ఈ జంఝాటమేమిటి?!

చిరాకేసింది.

ఈ ఉత్తరానికి ఇప్పట్లో జవాబు ఇవ్వకూడదని నిశ్చయించుకున్నాను.

గబగబా స్నానాదుల్ని ముగించి ట్రిమ్‌గా తయారై అలా బజార్లోకి బయల్దేరాను.

ముచ్చటగా ముస్తాబై సినిమాలకీ, షికార్లకి, మార్కెట్లకి తిరిగే అందమైన ఆడపిల్లల్ని చూస్తూ, చల్లగాలిని ఆస్వాదిస్తూ తిరిగితేనే సాయంత్రాలకి సార్థకతని చేకూర్చి నట్లనిపిస్తుంది! ఓపిక ఉన్నంతవరకూ అలా తిరిగి అందాన్ని ఆనందించి ఓపిక తగ్గగానే కనిపించిన హోటల్లో నాల్గు మెతుకుల్ని గతికి రూమ్‌కి చేరుకుని కలలు కంటూ పడుకోవడం అలవాటై పోయింది.

హైద్రాబాద్ మహానగరంలో నాకు చుట్టాలు గాని, పక్కాలు గాని లేరు. ఉద్యోగం పుణ్యాడూ అనే ఇక్కడికి వచ్చాను. అందుకని ఎవరైనా చూస్తారనిగాని, ఏమైనా అనుకుంటారని గాని భయం అసలు లేదు. వెనుకబడి గోలచేయక పోయినా నచ్చిన వాళ్ళని కన్నులారా చూసి ఆనందించడానికి మాత్రం భయపడాల్సిన పన్లేదు.

రంగురంగుల సీతాకోక చిలుకల్లాంటి పడతులతో రోడ్లన్నీ జిగేలు మంటున్నాయి. కాదు... కాదు... నా కళ్ళని జిగేలు మనిపిస్తున్నాయి.

"బాబూరావ్...!" పిలుపుతో నా అందాల వూహాలోకం లోంచి ఇవతలికి వచ్చి పడ్డాను.

ఇక్కడ నన్ను పిలిచేది ఎవరబ్బా?

వెనక్కి తిరిగాను.

నవ్వుతూ నిల్చున్న ఆమెని చూసే సరికి ఆనందంతో వుక్కిరి బిక్కిరయ్యాను.

జయలక్ష్మి!

మళ్లీ ఎన్నాళ్ళకి చూసాను!!

వయసుతో పాటు ఆమె అందమూ పెరిగింది.

"ఏమిటీ అలా చూస్తున్నావ్! నన్ను గుర్తు పట్టలేదా?" చిన్నగా నవ్వుతూ దగ్గరకి వచ్చింది.

నిన్ను గుర్తు పట్టక పోవడమా? ఇన్‌సల్ట్ నన్ను నేనైనా మరచిపోగలను గాని నిన్నెందుకు మరచిపోతాను...?!

"హఠాత్తుగా కనిపించేసరికి ఆశ్చర్యం వేసింది...." ఆ అందం ముందు నిలబడడానికి కంగారుగా వుంది. నాలో వువ్వెత్తున ఎగిరి పడుతున్న విపరీత భావాలు నాకు తెలీకుండా తడబాటుని కలిగించాయి.

"నిన్నిక్కడ అనుకోకుండా చూసేసరికి నాకూ ఆశ్చర్యం వేసింది. అయినా నీకులా మాటా పలుకూ లేకుండా వున్నానా?" మళ్ళీ నవ్వింది.

వద్దు జయా! అలా నవ్వద్దు ప్లీజ్!! నువ్వలా నవ్వితే నేను పిచ్చివాణ్ణయిపోతాను!

"హైద్రాబాద్‌లోనే వుంటున్నావా?" అడిగింది.

"ఉద్యోగం పుణ్యమాని ఇక్కడికి చేరుకుని ఆరునెలలైంది. హోటల్ భోజనం, రూమ్ నిద్ర...." నవ్వాను.

"ఫరవాలేదు మాటలు నేర్చావే..."

నిన్నలా చూస్తుంటే మాటలే కాదు పాటలు కూడా వచ్చేస్తాయి. అనాలనుకున్న ఆ మాటల్ని సభ్యత గొంతులోనే నొక్కేసింది.

"నువ్వూ ఇక్కడే వుద్యోగం చేస్తున్నావా?"

"ఇక్కడ ఉద్యోగం చేసేది నేను కాదు. మా ఆయన!"

ఉలిక్కిపడ్డాను.

ఈ అందం పరాయిదై పోయిందా! హఠాత్తుగా నా చూపులు ఆమె పాదాలను తాకాయి. ఆమె కాళ్ళకున్న మెట్టెలు తళుక్కున మెరిసాయి.

"నల్లకుంటలో వుంటున్నాము. రేపాదివారం మా ఇంటికి రాకూడదూ?" నా ఆలోచనలకి అందకుండా గబాగబా మాట్లాడేస్తోంది ఆమె.

తప్పకుండా వస్తాను ఒక్క ఆదివారమేం ఖర్మ రోజూ వస్తాను. నిన్ను చూడడానికి!

హాండ్‌బేగ్‌లోనుంచి ఓ చిన్న కాగితాన్ని తీసి దానిమీద తన ఇంటి వివరాల్ని రాసి అందించింది.

ఆ కాగితాన్ని అందుకునేప్పుడు ఆమె చేతివేళ్ళు తగిలాయి. జివ్వున షాక్ తగిలినట్లు చటుక్కున చేతిని వెనక్కి లాక్కున్నాను. కిసుక్కున నవ్విందామె.

జయా! ప్లీజ్ డోంట్ లాఫ్....! నీ నవ్వు నాలో వున్న సభ్యతని నాశనం చేస్తోంది!

"తప్పకుండా వస్తావుకదూ?"

"ఇవాళ సోమవారం... ఆదివారమంటే ఆరు రోజులుంది. అంతవరకూ రావద్దంటావా?" నా ప్రశ్న నాకే వెగటుగా అనిపించింది.

"అంతకన్నా ముందే నువ్వు వస్తానంటే ఇంకా ఆనందం... అవునూ! ఇప్పుడే నాతో ఎందుకు రాగూడదూ?" ఆమె అలా అడిగేసరికి విపరీతమైన ఆనందం వేసింది.

నాకులాగానే ఆమె ఆలోచిస్తోందా? పెళ్ళయినా కూడా ఆమెకి నామీదున్న అభిమానం తగ్గిపోలేదా?

నా భావాల్ని ఆమె చదివేయకుండా జాగ్రత్త పడసాగాను.

"ఇప్పుడు కాదు... రేపో ఎల్లుండో వస్తాను...." వెంటనే వెనకబడి వెళ్తే బాగుండదు. అనుమానం అలా మాట్లాడేటట్లు చేసింది.

"యు ఆర్ వెల్‌కమ్ ఎట్ ఎనీ మూమెంట్..... వస్తాను ఆయన ఆఫీసునుంచి వచ్చేసి వుంటారు. నా కోసం ఎదురు చూస్తూ వుంటారు...." అటుగా పోతున్న ఆటోని కేకేసి, సాధ్యమైనంత త్వరలో వాళ్ళింటికి రమ్మని మరోసారి చెప్పిమరీ ఆటోలో వెళ్లిపోయింది.

జయలక్ష్మి వెళ్ళిపోయినా ఆమె తాలూకు మధురస్మృతులు మాత్రం నా మనసుని పూర్తిగా కమ్మివేసాయి. భోంచేసి రూమ్‌కి చేరుకున్న తర్వాత కూడా ఆమె ఆలోచనలు నన్ను విడిచి పెట్టలేదు.

పదేళ్ళ గతంలోకి నా ఆలోచన్లు పరుగెత్తాయి.

జయ వాళ్ళు మా పక్కింటిలో అద్దెకి దిగారు. మా ఇద్దరిదీ ఒకే వయసు కావడంతో త్వరలోనే మంచి స్నేహమైంది..... ఇద్దరిదీ ఒకే క్లాసుకూడా కావడంతో కలిసే స్కూల్‌కి కూడా వెళ్ళేవాళ్ళం.

మా రెండు కుటుంబాల పెద్దల మధ్య కూడా స్నేహం పెంపొందడంతో మా స్నేహం మరింత బలపడింది.

జయకి లెక్కలు సరిగ్గారావు. నాకేమో లెక్కలంటే మంచి నీళ్ళప్రాయం!స్తూ అందుకని ఆమెకి లెక్కలని చెప్పాలని తెగ ప్రయత్నించేవాణ్ణి. తనూ శ్రద్ధగానే వచ్చేది. కానీ లెక్కలు నేర్చుకునేది కాదు. నేను చెప్తుంటే నా మొహంలోకి చూస్తు కూర్చునేది.

అరగంట సేపువాగి "అర్థమైందా?" అంటే "నీ పెదాలు కదుల్తున్నాయిగాని మాటలు నా చెవికి చేరడం లేదు" అనేది.

నాకు వళ్ళు మండేది.

కోపంగా కింది పెదవిని ముని పంటితో కొరికేవాణ్ణి.

"వద్దు.... వద్దు.... ఆ పెదాల్ని అలా కొరికేయకు.... అసలే ఎర్రటి పెదాలు...." మరింత వుడికి పోయేవాణ్ణి.

జన్మలో మళ్ళీ ఆమెకి లెక్కలు చెప్పగూడదనుకునే వాణ్ణి. కానీ "నాకీ లెక్క అర్థంకాలేదు. చెప్పవూ..." అంటూ ఆమె వచ్చేసరికి ఆ విషయాన్ని మరచిపోయేవాణ్ణి.

ఏ అరగంటో కంఠ శోషపడ్డ తర్వాతగానీ ఆమె నేను చెప్పేది వినడంలేదని అర్థం చేసుకునే వాణ్ణికాదు.

ఆ రోజుని నేనెప్పటికీ మరచిపోలేను.

బయట వర్షం పడుతోంది.

ఇంట్లో ఎవ్వరూ లేరు. వాళ్ళ వాటాలో జయ, మా వాటలో నేను మాత్రమే వున్నాం.

"నాకీ లెక్క చెప్పవా?" అంటూ పుస్తకాన్ని పుచ్చుకుని వచ్చింది జయ.

ఆ లెక్కని ఆమెకి అర్థమయ్యేలా చెప్పడం మొదలు పెట్టాను. పూర్తిగా ఎక్స్‌ప్లెయిన్ చెయ్యడం అయిపోయినా ఆమె నా వంక చూస్తూనే వుంది.

"ఏం? అర్థం కాలేదా?" అడిగాను.

"నిన్నే.....!?" గట్టిగా అరిచాను.

•

"నువ్వు మాట్లాడేటప్పుడు అందంగా కదిలే ఆ పెదాల్ని చూస్తే ఏమనిపిస్తోందో తెల్సా.... చటుక్కున వాటి నందుకుని కొరికేయాలనిపిస్తోంది."

ఆమె అలా అంత ధైర్యంగా అనేసరికి నాకు చెమటలు పట్టేశాయి. జయ మొండిధైర్యం నాకు తెల్సు!

"ఛ.... ఛ.... ఏమిటా పాడు మాటలు" చిరాకు పడ్డాను.

"పాడు మాట కాదు. నా మనసులో వున్నమాట!" నాకన్నా ఆమె ఎప్పుడూ ధైర్యవంతురాలే.

"చూడు జయా! మన పెద్దలు మన కిచ్చిన స్వేచ్ఛని దుర్వినియోగ పరచుకుంటే ముందు ముందు బాధపడాల్సి వస్తుంది..... ఈ విషయాలు వాళ్ళకి తెలిస్తే వాళ్ళముందు తలెత్తుకుని తిరగ్గలమా" నచ్చచెప్పసాగాను.

జయ నా మాటల్ని వినిపించుకోకుండా ఏమేమో మాట్లాడసాగింది. అక్కడ వుండడం భయం వేసి చటుక్కున చెప్పుల్ని వేసుకుని ఆ వర్షంలోనే బయటికొచ్చేసాను. తర్వాత ఎప్పుడో నేనింటికి చేరుకునేసరికి వాళ్ళింట్లో వాళ్ళు మా ఇంట్లో వాళ్లు అందరూ వచ్చేశారు.

జయ అప్పటి నుంచి నాతో మాట్లాడటం మానేసింది. నన్ను తప్పించుకుని తిరగసాగింది. సరిగ్గా నెల రోజులు కూడా తిరక్కుండానే వాళ్ల నాన్నగారికి ఆ వూరు నుంచి ట్రాన్స్ఫరై పోయింది. వెళ్ళేటప్పుడు కూడా ఆమె నాతో మాట్లాడలేదు.

అలాంటి జయ ఇన్నేళ్ళ తర్వాత హఠాత్తుగా కనిపించి మొదటికన్నా ప్రేమగా పలకరించింది. అంటే నా మీద ఆమెకున్న 'ప్రేమ' ఏమాత్రం తగ్గలేదన్నమాట!

అప్పట్లో చిన్నవాణ్ణి. నాకు చాలా విషయాలు తెలీవు. ఇప్పుడు చేతికి అందివచ్చిన అవకాశాన్ని చెయ్యిజారనివ్వదలచుకోలేదు.

జయ గురించి తియ్యటి కలలతో ఆ రాత్రి నిద్ర సరిగ్గా పట్టలేదు. మర్నాడు ఆఫీసులో కూడ పని మీదకి మనస్సు పోలేదు.

పర్మిషన్ తీసుకుని పెందలాడే జయ వాళ్ళింటికి బయల్దేరాను. అలా బయల్దేరితే వాళ్లాయిన కూడా వుండడని ఆశ! ఆమె ఇచ్చిన అడ్రసు ప్రకారం ఇంటికి చేరుకున్నాను. నన్ను చూస్తూనే ఎంతో ఆనందపడింది జయ. ఈ ఆనందం నీకు శాశ్వతం చేస్తాను జయా!

"అక్కడే నిలబడి పోయావేం? రా లోపలికి" నవ్వుతూ ఆహ్వానించింది.

నవ్వితే ఆమె అందం విజృంభిస్తుంది. కొన్ని క్షణాల్లో ఆ అందాన్ని నా సొంతం చేసుకోబోతున్నాను. ఆమెనే చూస్తూ మంత్రించిన వాణ్ణిలా లోపలికి అడుగు పెట్టి సోఫాలో కూర్చున్నాను. "వన్ మినిట్ కాఫీ తీసుకువస్తా...." ఆమె లోపలికి వెళ్ళింది.

ఇంక కాలాన్ని వృధా చేయకూడదని పించింది. ఆమె వెనుకే లోపలికి వెళ్ళాను. ఇదే మంచి సమయం.

"నిన్ను చూడగానే నాకు ప్రాణం లేచి వచ్చింది" కాఫీ కలుపుతోంది. నాకూ ప్రాణం లేచొచ్చింది. వెనుక నుంచే ఆమెను నా బాహువుల్లో బంధించి వేయాలని రెండడుగులు ముందుకేశాను.

"నీలాంటి మంచి స్నేహితులు దొరకడం నిజంగా ఎంతో అదృష్టం. అప్పట్లో నా తెలీనితనాన్ని నువ్వు ఏ మాత్రం అవకాశంగా వినియోగించుకున్నా నా జీవితం నాశనమై పోయేది. నువ్వు అప్పుచెప్పిన మాటల్ని నేను ఎప్పుడూ మరవలేను. అప్పుడు కోపమనిపించినా ఆ తర్వాత నీతో అలా ప్రవర్తించినందుకు ఎంతో

బాధ పడ్డాను. నువ్వు అంత పవిత్రంగా ప్రవర్తించబట్టి ఇప్పుడు మనమింత ఆనందంగా మాట్లాడుకోగలుగుతున్నాం. నిజంగా నువ్వెంత మంచి మనిషివి....!"

జయ మాటలు నా కాళ్ళని బంధించి వేశాయి. ముందుకు అడుగుపడలేదు. అంత వరకూ నా మనసులో వున్న దుర్మార్గపు ఆలోచనలన్నీ ఒక్కసారి రెక్కలు గట్టుకుని ఎగిరిపోయాయి. నాకన్నా ఆమె ఎంతో పెరిగిపోయినట్లనిపించింది...!

మా ఇద్దరి వయసూ ఒకటే! అయినా ఎంత తేడా! అప్పటి ఆమె ఆలోచనల స్థాయిలోనే ఇప్పుడు నేనున్నాను.

ఆడవాళ్ళు మానసికంగా ముందు పెరుగుతారు కాబట్టి భార్యాభర్తలలో భార్య వయసు తక్కువ వుండాలని మనవాళ్లు నిర్ణయిస్తుంటారని కూడా అప్పుడు అనిపించింది నాకు.

వయసు మత్తు నన్నింకా పూర్తిగా ఆవహించి వుంది కాబట్టే ఏ ఆడపిల్ల నవ్వుతూ కనిపించినా నాకు ఒకటే భావం కలుగుతోంది.

ఆమె ఇచ్చిన కాఫీని గటగటా తాగేసి మళ్ళీ వస్తానని వచ్చేసాను. మరికొద్ది సేపు వుండమని ఆమె ఎంత బ్రతిమాలినా వుండబుద్ధి కాలేదు. మనసులోని మాలిన్యాన్ని పూర్తిగా కడిగేసినప్పుడే తిరిగి ఆమె దగ్గరకి వెళ్లాలనీ నిశ్చయించుకున్నాను.

చకచకా రూమ్‌కి చేరుకుని వెంటనే "మీకు అన్ని విధాలా నచ్చిన సంబంధాన్ని చూసి నిశ్చయించండి. మీ నిర్ణయమే నా నిర్ణయం" రాసి పడేసిన తర్వాత కొద్దిగా స్థిమితంగా అనిపించింది. *

(ఆంధ్రభూమి సచిత్రవారపత్రిక 21-6-84)

# ఆ వయసు వేరు

తమ ఆఫీసుకు రాబోయే కొత్త ఆఫీసర్ పేరు నిరంజనం అని విన్నప్పటి నుంచీ మనసు మనసులో లేదు రాఘవకి.

ఆ నిరంజనం, ఈ నిరంజనం ఒక్కడే కాదు గదా? అదే అతని మనసుని భయపెట్టి బాధిస్తున్న ఆలోచన.

అతనే అయితే తన అంతు చూడక మానడు! రాఘవ దిగులు పడిపోసాగాడు.

అతను భయపడుతున్న రోజు రానే వచ్చింది. ఆ రోజే కొత్త ఆఫీసర్ గారు వచ్చేది.....

అందరూ పది గంటలు కూడా కాకుండానే వచ్చేసారు. బుద్ధిగా ఎవరి సీట్లో వాళ్ళు కూర్చుని శ్రద్ధగా పని చేస్తున్నట్లు నటించసాగారు. కొత్త ఆఫీసర్ ఎలాంటి వాడో......? అదే అందరి లోనూ వున్న భయం....

పని చేస్తున్నట్లు ఫోజు పెట్టి సీట్లలో కూర్చున్నా అందరి దృష్టి గుమ్మం మీదే వుంది. కారు శబ్దం వినబడితే చాలు కొత్త ఆఫీసర్‌గారు వచ్చేసారేమోనని కంగారు పడిపోసాగారు.

తన క్లాస్‌మేట్ నిరంజనం, ఈ ఆఫీసర్ నిరంజనం ఒక్కళ్ళు కాగూడదని మనసులో పేరు పేరునా అందరి దేవుళ్ళకీ మొక్కుకోసాగాడు రాఘవ.

ఇంతలో కారు ఆగిన శబ్దం కావడంతో అటెండరు బయటికి పరుగెత్తాడు.

అతను కారు తలుపు తీయగానే హుందాగా బయట కాలు పెట్టింది ఆరడుగుల పొడవు శరీరం. బ్లాక్‌సూట్‌తో తెల్లటి శరీరం మెరిసిపోతోంది.

ముందు ఠీవిగా ఆఫీసర్.... వెనుక నమ్రతగగా అటెండరు.... లోపలికి అడుగు పెట్టారు.

అందరూ చటుక్కున లేచి నిలబడ్డారు.

అందరి వంకా ఒక్కసారి నిశితంగా చూసాడు ఆ కుర్ర ఆఫీసర్.

రాఘవ నెత్తిన పిడుగుపడ్డట్టు వులిక్కిపడ్డాడు.

వాడే ఆ నిరంజనంగాడే ఈ ఆఫీసర్!! ఇక తన భరతం పడతాడు!!! కాళ్ళు వణక సాగాయి....

తనకి విష్ చేసిన వాళ్ళందర్నీ విష్ చేస్తూ హుందాగా ముందు కొస్తున్నాడు.....

తన దగ్గరికి రాగానే తనకి తెలీకుండానే విష్ చేసాడు రాఘవ.

నిర్లక్ష్యమైన చిరునవ్వుని విసిరేసి ముందు కెళ్ళిపోయాడు నిరంజనం.... తల తీసేసి నట్లనిపించింది రాఘవకి.

సీట్లో కూర్చున్నాడన్న మాటే గాని మనసు పని మీద లగ్నం కావడం లేదు.

"ఆఫీసర్ గారు పిలుస్తున్నారు....." అటెండర్ చెప్పాడు.

వస్తూనే మొదలు పెడుతున్నాడన్నమాట! తప్పదు... ఇప్పుడు తను వాడి చేతిలో చిక్కాడు ఏం చేసినా భరించాల్సిందే!!

ఆఫీసర్ రూమ్‌లోకి అడుగు పెట్టాడు.

"వూ.... నువ్విక్కడ క్లర్క్‌గా పని చేస్తున్నావన్నమాట.....!" రివాల్వింగ్ ఛెయిర్లో అటు ఇటు తిరుగుతూ అడిగాడు నిరంజనం.

"అవున్సార్...."

"నేను వర్క్ విషయంలో చాలా స్ట్రిక్ట్. వర్క్ పెండింగ్ వుండడానికి వీల్లేదు..... ఆ విషయం హెచ్చరించడానికే పిలిచాను. ఇక వెళ్ళు...."

బయటి కొచ్చేసాడు రాఘువ.

ఇలా పిలిచి తనొక్కడికే వార్నింగ్ ఇవ్వడంలోనే బయట పడుతోంది నిరంజనం మెంటాలిటి. ఇక తనని చీల్చి చెండాడుతాడు అందులో సందేహం లేదు.

సీట్లో కూలబడి ఫైళ్ళలో మునిగిపోయాడు రాఘువ.

మరో అరగంటలోనే మరో పిలుపు...

నీ సీట్లో వర్క్ అంతగా పెండింగ్ వుందేం అఫీసచ్ చివాట్లు. తను కొత్తగా ఆ సీట్లోకి మారాడు. ఈ కొద్దికాలంలోనే చాలా బాగా పెండింగ్ క్లియర్ చేసాడు. ఆ విషయం చెప్పినా అతను పట్టించుకోడు. అందుకే మౌనంగానే చివాట్లన్నింటినీ భరించాడు. సీట్లోకి వచ్చి కూలబడ్డాడు. వెనుకే హెడ్‌క్లర్క్ అఫీసర్ రూమ్‌లోకి వెళ్ళాడు. మిగతా స్టాఫంతా జాలిగా చూడసాగారు. లంచ్ వరకూ వంచిన తల ఎత్తకుండానే పని చేసుకుపోసాగాడు రాఘువ.

లంచ్ అవర్ లో కూడా అతనికి బయటికి వెళ్ళ బుద్ధి కాలేదు. సీట్లోనే కూర్చుని ఆలోచించసాగాడు.

ఇలా ఎంత కాలం తను నిరంజనం కింద పని చేయగలడు? శలవు పెట్టేస్తే.... ఎంత కాలమని శలవు పెట్టగలడు? పోనీ రిజైన్

చేస్తేను? తనతో పాటు పెళ్ళాం పిల్లల్ని కూడా పస్తు పడుకో బెట్టి చంపేయాలి.......

తనని చూస్తే పిల్లిలా భయపడే నిరంజనం ఇప్పుడు పులిలా దెబ్బకొట్టడానికి చూస్తున్నాడు. ఈ అయిదారు సంవత్సరాలలోనే ఎంత మార్పు! అప్పటికీ ఇప్పటికీ ఎంత తేడా!! కాలేజీ రోజులు అతని కళ్ళ ముందు మెదిలాయి..

ఒక్క చదువులోనే కాదు. అన్నింటిలోనూ తనే ముందుండేవాడు. కాలేజీ డ్రమెటిక్ అసోసియేషన్ సెక్రటరీ.... ఎన్.సి.సి. అండర్ ఆఫీసర్...! తనంటే పెద్ద హీరో వర్షిప్ వుండేది.

అందరికీ నేనంటే అభిమానముంటే నాకు మాత్రం నీరజ అంటే క్రేజ్ వుండేది! ఆ క్రేజ్ కోసం ఏమి చేయడానికైనా సిద్ధంగా వుండేవాణ్ణి.

నీరజకి క్లాస్‌లో బాగా చదివేవాళ్ళంటే మంచి అభిమానముండేది. అందుకే ఎవరికి వారు ఆమె అభిమానాన్ని సంపాదించడం కోసం బాగా చదివేవాళ్ళం.

తనకి యాక్టివిటీస్ ఎక్కువగా వుండడంతో హఠాత్తుగా తనని అధిగమించేసాడు నిరంజనం. హాఫ్ ఇయర్లీ ఎగ్జామ్స్‌లో అందరికన్నా అతనికే ఎక్కువ మార్కులు వచ్చాయి.

నీరజ అతని వేపు ఎక్కడ ఆకర్షింప బడుతుందో అనే భయం తనలో చోటు చేసుకుంది. ఫలితంగా అతని బలహీనమైన ఆర్థిక పరిస్థితిని ఆసరాగా తీసుకుని రకరకాలుగా ఏడిపించసాగాడు.

ఒక రోజున ఓ చిలిపి ఆలోచన వచ్చింది. రావడమే ఆలశ్యం ఆచరణలో పెట్టేసాడు కూడా! తనేదైనా అనుకోవడమే ఆలశ్యం ఆచరణలో పెట్టేందుకు తోడ్పడడానికి ఎంతో మంది మిత్రులు!

ఒక చక్కటి ప్రేమలేఖని ఆచారితో రాయించి టైప్ చేయించాడు. కింద దొంగ సంతకాలు పెట్టడంలో వుద్ధండుడైన శేఖరం చేత నిరంజనం సంతకం పెట్టించాడు. జాగ్రత్తగా ఆ వుత్తరం నీరజకి చేరేటట్టు చేసాడు.

నిరంజనం రాసిన లవ్ లెటర్ చూడగానే నీరజ మండిపడుతుంది. ప్రిన్స్‌పల్‌గారికి రిపోర్ట్ ఇస్తుంది. ఒక్కదెబ్బతో రెండు పిట్టలు అన్నట్లు నీరజ విషయంలో వాడి పోటీ తొలగడమే కాకుండా తనకన్నా ఎక్కువ మార్కులు తెచ్చుకునేవాడు కూడా క్లాస్‌లో వుండడు. అదీ తన ప్లాన్!

లవ్‌లెటర్ చదువుకున్న నీరజ మండి పడింది. దానిని నలిపి అందరూ చూస్తుండగానే నిరంజనం మొహం మీద కొట్టింది. అతనేదో చెప్పడానికి ప్రయత్నించినా వినిపించుకోలేదు.

"చదువుకోడానికి కాలేజీకి వచ్చి ఇలాంటి పనులు చెయ్యడానికి సిగ్గులేదూ...." అంటూ దులిపేసింది.

నిరంజనం మొహంలో కత్తివేటుకి నెత్తురు చుక్క లేదు. సహనంతోనే నీరజ తిట్టే తిట్లన్నింటినీ భరించాడు. వెళ్తూ వెళ్తూ అతను తన వంక చూసిన చూపును మాత్రం ఎప్పుడూ మరచిపోలేడు... ఎంత అసహ్యంగా చూసాడూ... ఇప్పుడూ అదే చూపు..... అప్పుడు తను చేసిన దానికి ఇప్పుడు ప్రతీకారం తీర్చుకోబోతున్నాడు..... ఇప్పుడు నిరంజనాన్ని ఢీకోడమంటే కొండతో ఢీ కోడమే!

"మిమ్మల్ని ఆఫీసర్‌గారు పిలుస్తున్నారు" అటెండర్ పిలుపుతో ఈ లోకంలోకి వచ్చాడు రాఘవ.

లంచ్ అవర్లో కూడా తనని విడిచి పెట్టడా? తను హంబుల్‌గా వున్నా విడిచిపెట్టడు! అట్లాంటప్పుడు తిరిగి పౌరుషాన్ని నిలబెట్టుకుని వుద్యోగాన్ని వూడగొట్టుకోవడమే మేలు.....!

స్థిర నిశ్చయానికి వచ్చి ఆఫీసర్ రూమ్ వేపు నడిచాడు.

"రావోయ్ రాఘవా.... రా..... లంచ్ అవర్లో కూడా సీట్లోంచి లేవకుండా కూర్చున్నావేమిటి?" చిన్నగా అన్నాడు నిరంజనం.

అనుకోని వాతావరణానికి కొద్దిగా కంగారుపడ్డాడు తను.

"అబ్బే..... ఏం లేదు...."

"నేను వచ్చినప్పటి నుంచీ చూస్తున్నాను. ఏమిటీ అదో మాదిరిగా వున్నావ్?" నిరంజనం సూటిగా అలా అనేసరికి ఏం జవాబు ఇవ్వాలో అర్థం కాలేదు రాఘవకి. ఇంతలో అటెండర్ కాఫీలు తెచ్చాడు.

తనో కప్పుని అందుకుని, రాఘవకి ఓ కప్పుని ఆఫర్ చేసాడు నిరంజనం.

హఠాత్తుగా అతనిలో కనిపిస్తున్న మార్పుని ఎలా అర్థం చేసుకోవాలో తెలీక తికమక పడసాగాడు రాఘవ.

"ఇంతకు ముందు నా ప్రవర్తన చూసి చిరాకు పడి వుంటావ్..... అవునా?" కాఫీ సిప్ చేస్తూ రాఘవ మొహంలోకి చూసాడు నిరంజనం.

"లేదే....."

గట్టిగా నవ్వాడు నిరంజనం. "నీలో ఎంత మార్పు! అప్పటి రాఘవకి, ఇప్పటి రాఘవకి ఎంత తేడా! ఎదుటి వారి తల వంచడమే గాని తన తలవంచడమే తెలీదు ఆ రాఘవకి. అనవసరంగా

కంగారుపడిపోవడం, అతి వినయాన్ని చూపించడం ఈ రాఘవకి అలవాటు అయ్యింది.....!

ఇబ్బందిగా అనిపించసాగింది రాఘవకి 'ఇలా మాట్లాడడం కన్నా తిట్టడమే మేలు!'

"నీకు గుర్తుందా ఆ సంఘటన. నేను రాసినట్లు లవ్ లెటర్ రాసి ఇస్తే నీరజ పూర్వాపరాలు ఆలోచించకుండా అందరిలోనూ నన్ను అవమానించింది. అప్పుడే ఆ క్షణంలో శపథం తీసుకున్నాను - ఆమె చేతే పొగిడించుకోవాలని! రాత్రింబగళ్ళు కష్టపడ్డాను. యూనివర్శిటీ రాంక్ వచ్చింది. స్కాలర్‌షిప్‌తో పోస్ట్ గ్రాడ్యుయేషన్ కూడా చేసి మంచి మార్కులు సంపాదించాను. నేనెంత కష్టపడి చదువుతున్నా మీ ఇద్దరి గురించీ ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనే వుండేవాణ్ణి. యాక్టివిటీస్ ఎక్కువయి పోయిన నువ్వు డిగ్రీతోనే చదువాపేసావు..... నీకు వుద్యోగం వచ్చిన డిపార్ట్‌మెంట్‌లోనే నాకూ వుద్యోగం రావాలని, ఆఫీసర్‌గా వుండి నిన్ను సాధించాలని అనుకుంటూ వుండేవాణ్ణి....." ఒక్క క్షణం చెప్పడం ఆపి, కాఫీని పూర్తి చేసి కప్పు కింద పెట్టాడు. నిరంజనం.

కాఫీ తాగడం కూడా మరచిపోయి గుండెలు వుగ్గబట్టుకుని కూర్చున్నాడు రాఘవ.

"మరేం కంగారుపడకు కాఫీ కానీ..... ఆ వయసు వేరు. ఆ ఆలోచనలు వేరు. ఇప్పుడవన్నీ సిల్లీగా అనిపిస్తాయి. ఇప్పుడు ఈ ఆఫీసుకు అధిపతిని నేను. బాగా పనిచేసే వాళ్ళు కావాలి నాకు. నీ గురించి హెడ్ క్లర్కు ద్వారా తెలుసుకున్నాను. కొత్తగా ఆ సీట్‌కి వచ్చావని, పెండింగ్ వర్క్ అంతా త్వర త్వరగా క్లియర్ చేస్తున్నావని. వెరీగుడ్...... కీప్ ఇట్ అప్....."

"థాంక్యూ సర్......" ఎప్పుడు ఆ గదిలోంచి బయటపడదామా అని వుంది రాఘవకి.

"నీకు కూడా నేను థాంక్స్ చెప్పాలి. నువ్వప్పుడు అలా చేసావు కాబట్టి నేనిప్పుడీ స్థితికి వచ్చాను. అంతకన్నా ముఖ్యంగా నీరజని భార్యగా పొందగలిగాను... మీ నాటకం తెలిసి తర్వాత నాకు క్షమాపణలు చెప్పుకుంది. బహుశా అప్పుడే మొదలైందేమో మా ఇద్దరి మధ్యా ప్రేమ....! వచ్చే వారంలో ఆమెను తీసుకొస్తాను. ఓ మంచి ఇల్లు చూసిపెడుదూ..." చిరునవ్వుతో అడిగాడు నిరంజనం. "అలాగే సర్...." అంటూ తన సీట్లోకి వచ్చి ఫైళ్ళలో మునిగిపోయాడు రాఘవ. *

(ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక 5-7-84)

# వయసు రహస్యం

"మృణాళినీ! కాస్త ఈ పెట్టె అటు పెడ్దాంరా...."

"... ... ..."

"అమ్మా! ఈ అల్మైరాలో నా పుస్తకాలు పెట్టుకుంటాను."

"ఏయ్! అక్కడ నా పుస్తకాలు పెట్టుకుంటాను."

"అబ్బబ్బ! ప్రతీదానికీ అలా కీచులాడుకోకండి. దాంట్లో నాల్గరలున్నాయ్! చెరు రెండరలు వాడుకోండి."

"రాధా! డైనింగ్ టేబు లెక్కడ పెడ్దాం?"

"అదిగో! ఆ గదిలో...."

పక్క వాటాలోకి కొత్తగా సామాన్తో సహా వచ్చేసినట్లున్నారు. వాళ్ళ హడావిడితో మెలుకువొచ్చింది. కిటికీలోంచి ఎండపొడ కొద్ది కొద్దిగా లోపలి కొస్తోంది.

'మొగగొంతు అయన్ది' తప్ప మరెవ్వర్దీ వినిపించడం లేదు. బహుశా ఆయనకి మొగపిల్లల్లేరేమో! అన్నీ ఆడ గొంతులే వినబడుతున్నాయ్! పర్లేదు - మంచి కాలక్షేపమే!

బద్ధకంగా వుంది. మెలుకువొచ్చినా లేవబుద్ధి పుట్టక అలానే పడుకున్నాను వాళ్ళమాటలు వింటూ!

"ఏరా! ఎనిమిదవుతున్నా ఇంకా లేవబుద్ధి పుట్టడం లేదా?" అమ్మ కేకతో నెమ్మదిగా మంచం దిగాను.

బ్రష్షందుకొని పెరటి గుమ్మంకేసి నడిచాను.

పెరట్లో రకరకాల మొక్కలున్నాయ్. వాటి మధ్యగా తిరుగుతూ పళ్ళు తోముకోవడం సర్దా!

పెరట్లోకి అడుగు పెట్టగానే కాళ్లు, కళ్ళు ఆశ్చర్యంతో నిల్చిపోయాయ్

అందం... అందానికి తగ్గ శరీర సౌష్టవం.... ఎంత బావుందామె!

మృణాళినీ యేమో!

పూలు కోస్తున్నదల్లా నా రాక గమనించినట్లుంది. చివుక్కున తలెత్తి చూసి చర చరా లోపలికెళ్ళి పోయింది.

అదేమిటి! అలా చూసిందేమిటి నేనేదో క్షమించరాని తప్పుచేసినట్లు! ఆ పెరటిని రెండు వాటాల వాళ్లూ వాడుకుంటారు. వాళ్లదొక్కళ్లదే కాదే! ఆమె ప్రవర్తన కొద్దిగా బాధ కల్గించింది. అక్కడ నిలబడలేక గబగబా బాత్‌రూమ్‌లో కెళ్ళిపోయాను.

***

సాయంత్రం కాలేజీ నించి వచ్చేసరికి అమ్మ, మృణాళినీ వాళ్ళమ్మగారు హాల్లో సోఫాలో కూర్చుని కాఫీ తాగుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. కొద్దిగా ఇవతలిగా కూర్చుని తమ్ముడు, మృణాళిని కబుర్లు చెప్పుకుంటున్నారు.

సందేహిస్తూనే లోపలికి అడుగు పెట్టాను.

అంతదాకా నవ్వుతూ తమ్ముడితో మాట్లాడుతున్న దల్లా నన్ను చూడగానే లేచి తమ వాటాలోకి వెళ్ళిపోయింది మృణాళిని!

ఛెళ్ళున చెంపమీద కొట్టినట్లనిపించిందామె ప్రవర్తన.

వీడే మా పెద్దాబ్బాయ్!" మృణాళిని అమ్మగార్కి నన్ను పరిచయం చేసిందమ్మ. అప్రయత్నంగానే నమస్కారం చేశాను.

"ఏం చదువుతున్నావ్ బాబూ?" అడిగారావిడ.

"బి.యస్.సి.ఫైనలియర్"

"మృణాళిని కూడా బి.యస్.సి.నే చదువుతోంది. మొదటి సంవత్సరం"

ఊహూ! అన్నట్టు తలూపి వూరుకున్నాను.

వాళ్ళిద్దరూ తిరిగి కబుర్లలో పడ్డారు.

గబగబా నా రూమ్‌లోకెళ్ళి పుస్తకాలు పడేసి, తిరిగి బయటికి బయల్దేరాను.

మనస్సు చికాగ్గా తయారైంది.

ఆ అమ్మాయి నన్ను చూడగానే ఎందుకలా పారిపోతుంది? తన కంటికి నేనంత దుష్టుడిలాగా కనబడుతున్నానా! ఒకవేళ తనేమైనా వెకిలిగా ప్రవర్తించాడు అంటే అసలింతవరకూ ఆమెని పరీక్షగా చూడను కూడా చూళ్ళేదే! మరెందుకలా ప్రవర్తిస్తోంది? ఎదుటి మనిషి బాధపడతాడనే భావం కూడా ఆమెకుండదా?

ఆమె రూపం మరోసారి కంటిముందు తళుక్కుమంది.

తనెందగత్తెననే గర్వమేమో!

తనందగత్తయితే మాత్రం! ఎదుటివాడు వెధవనుకుంటోందా? అందరూ తనందాన్ని చూసి వెకిలిగా వెంటబడతారనుకుంటోందా వాళ్ళకి వ్యక్తిత్వం, మానాభిమానాలుంటాయనీ ఆమెకి తెలీదా?

ఆమె ప్రవర్తనవల్ల చాలా బాధ కల్గింది. ఒకవేళ తనెక్కడైనా కన్పించినా తలెత్తి కూడా చూడకూడదని నిశ్చయించుకున్నాను.

కాసేపలా అలా తిరిగి ఇంటికి చేరుకున్నాను.

పెరటి గుమ్మంలో నిలబడి అమ్మతో మాట్లాడుతోంది మృణాళిని.

నన్ను చూడగానే రాక్షసుడ్ని చూసినట్లు పరుగెత్తుతుంది కాబోలు! విసుగ్గా వాకిట్లో కుర్చీలో కూలబడ్డాను.

రకరకాల ఆలోచన్లు మనసుని ముసురుకోసాగాయ్.

నన్ను చూడగానే ఆమెందుకలా బెదిరిపోతుంది?

ఇంతకు ముందు వాళ్ళు రెండు వీధులవతలుండే వాళ్ళట! పోనీ ఈ ఇంట్లోకి రాకముందు నేనెవరైనా ఆడ పిల్లని గోల చేస్తుండగా చూసిందేమో భయపడి పోతోందనుకోడాన్కి నేనెప్పుడూ ఏ ఆడపిల్లతోనూ అసభ్యంగా ప్రవర్తించెరుగను. కనీసం ఏ ఆడపిల్లతో నైనా రోడ్డు మీద నిలబడి మాట్లాడే అదృష్టానిక్కూడా నోచుకోలేదు నేను! మరెందుకీమె ఇట్లా ప్రవర్తిస్తోంది?

మొగవాళ్లంటే ఆమెకున్న నీచభావాన్ని తొలగించాలి. అందరు మొగవాళ్ళు అందమైన ఆడపిల్ల కన్పించగానే వెనుకబడరని నిరూపించాలి. గట్టిగా నిశ్చయించుకున్నాను.

మర్నాడు సాయంత్రం సెంటిమెంటల్‌గా మరో దెబ్బతిన్నాను.

నేను కాలేజి నుంచి వచ్చేప్పటికి నాన్నగార్తో మాట్లాడు తున్నదల్లా మృణాళిని నన్ను చూడగానే వెళ్ళిపోయింది.

నాన్నగార్తో మాట్లాడుతుంది. అమ్మతో మాట్లాడుతుంది నన్ను చూడగానే మాత్రం పరుగెడుతుంది! అంటే నేననుకున్నట్లు ఆమెకి గర్వంలేదు. కానీ మరి నే నామె దృష్టిలో అంత రాక్షసుడిగా ఎందుకు చిత్రించ బడ్డానో ఎంతాలోచించినా అర్థం కావడం లేదు.

దాదాపు పదిరోజులు గడిచిపోయిన్నై. మృణాళినికి మా ఇంట్లో వాళ్ళందరితోనూ బాగా చనువేర్పడింది - నాతో తప్ప. నన్ను చూట్టం అలస్యం -పరుగే!

ఆ రోజు బస్టాప్‌లో నిలబడి ఆ విషయమే ఆలోచిస్తున్నాను.

దాదాపలా ఓ అరగంట నిలబడ్డ తర్వాత బస్సొచ్చింది.

అప్పటికే సీట్లన్నీ నిండిపోయాయ్! నల్గురైదుగురు నిలబడి కూడా వున్నారు. నాతోపాటే ఆ స్టేజీలో మరో ముగ్గురు కుఱ్ఱాళ్ళెక్కారు. అందరం గేటు దగ్గర నిలబడ్డాం.

తర్వాత స్టేజీలో ఎవ్వరూ దిగలేదు కాని మరో ఇద్దరెక్కారు. బస్సు బయల్దేరబోతున్న సమయంలో ఒకావిడ హడావిడిగా పరుగెత్తుకుంటూ వచ్చి మేం నిలబడ్డ ద్వారం గుండా ఎక్కింది బస్సు.

ఆమెకి సుమారు నలభై సంవత్సరాలుంటాయ్. పరుగెత్తుకు రావడం వల్ల మొహమంతా చెమట పట్టింది. అయాసపడుతోంది.

ఒక్క నిముషం అలానే నిలబడి బస్సంతా పరికించి చూసింది. ముందు లేడీస్ సీట్లలో ఒక సీటు ఖాళీగా వుంది.

అమె మొహం ఆనందంతో వికసించింది. కర్చీఫుతో మొహం తుడుచుకుంటూ గబగబా అటు బయల్దేరింది. ఆ వెళ్ళే హడావిడిలో మా కాళ్ళు తొక్కుతున్నది కూడా అమె గమనించడం లేదు. మమ్మల్ని తోసుకుంటూ, రాసుకుంటూ మామధ్య నించీ ముందుకు బయల్దేరింది.

నాల్గైదడుగులేసిం తర్వాత సడెన్‌గా ఆగిపోయింది.

ఆంత సడెన్‌గా అమె ఆగిపోయేసరికి ఆశ్చర్యం వేసింది - ఎందుకాగి పోయిందా అని అటు చూశాను. వెంటనే నాకు నవ్వొచ్చేసింది.

ఆమె ముందు దారి కడ్డంగా సుమారు ఆమె వయస్సేవున్న ఒకాయన నిలబడున్నాడు. అతనీమెని గమనించడంలేదు. అటువేపు తిరిగి నిలబడున్నాడు. ఆమె ముందుకెళ్ళాలంటే అతడ్ని తాకుతూ వెళ్ళాల్సిందే. పక్కకి తప్పుకోమని అతనికి చెప్పడానిక్కూడా ఆమె సిగ్గుపడి పోతోంది. మా మధ్య నించీ అలా దూసుకుపోయిన మనిషి మరతని దగ్గరంతగా సిగ్గెందుకు పడ్తోందో? హఠాత్తుగా తట్టింది నాకు.

ముందు నిలబడ్డ మేము తనకన్నా చిన్నవాళ్లం. అందుకని మాకు తన శరీరం తగుల్తున్నా బిడియం లేకుండా ధైర్యంగా ముందుకెళ్లి పోయింది. కానీ అక్కడ నిలబడ్డతను ఆమె వయసు వాడవడంతో - అప్పుడామెకి తను స్త్రీ, అతను పురుషుడు అన్న భావన కల్గింది. ఆ భావన ఆమెకి సహజంగా సిగ్గుని కల్గించింది. అందుకే అతన్తో మాట్లాట్టానిక్కూడా సంశయిస్తోంది.

నాకు ఠక్కున మృణాళిని గుర్తుకొచ్చింది. అప్పుడు నా కర్థమైంది. మృణాళిని, నేను ఇంచుమించు ఒక వయసు వాళ్ళమే. అందుకే నాతో మాట్లాడదు. నన్ను చూస్తే బెదిరిపోతుంది. ఆ మరుక్షణం మృణాళిని మీద పేరుకున్న కోపమంతా మంచులా కరిగిపోయింది.

*

(ఆంధ్ర సచిత్ర. వారపత్రిక 26-5-78)

# వయసు - వ్యామోహం

రోహిణి మనసాలోచనల్తో చికాకైపోయింది.

ఆఫీసుకు చేరుకున్న తర్వాత కూడా ఆ ఆలోచన్లామెని విడిచి పెట్ట లేదు. పని చేయాలనిపించడం లేదు.

పోనీ శలవు పెట్టి ఇంటికి వెళ్లి పోదామంటే ఇంటి దగ్గర అస్సలు మనశ్శాంతి వుండదు.

'హు... చేతులారా చేసుకున్నది! అంతా తన ప్రారబ్ధం! ఇప్పుడనుకుని మాత్రం ప్రయోజన మేముంది?'

బావ రమణిని ప్రేమించాడని తెలిసి కూడా అతన్నే పెళ్లిచేసుకుంటానని మొండికేసి కూర్చోవడం తన మూర్ఖత్వం. అమ్మా నాన్నలకు తనొక్కర్తే కూతురు కావడంతో ఆస్థి కోసం అత్తయ్యా మావయ్యలు తనని కోడలుగా చేసుకోవాలని వువ్విళ్ళూరసాగారు. ఫలితంగా బావ మరెవర్నో ప్రేమించినా తనకే దక్కాడు.

ప్రాణం కన్న మిన్నగా ప్రేమించిన బావని భర్తగా పొందగల్గినందుకు గర్వించింది ఆ గర్వమెంతో కాలం నిలువలేదు. బావ భౌతికంగా తనకి దగ్గరైనా, మానసికంగా తనకెంతో దూరమనే విషయం అర్థమైపోయింది.

అప్పటికే చేతులు కాలాయ్! ఆకులు పట్టుకుని మాత్రం లాభమేంటి? జీవితాంతం వుత్తర దక్షిణ ధృవాల్లాగానే కాపురం చేయ్యాలి.

తనంటే ప్రత్యేకమైన అభిమానం లేకున్నా పర్లేదు. తను దాని కంతగా బాధపడదు.... కానీ తను మాట్లాడితేనే చికాకు! పొద్దునకి పొద్దున తనేమన్నదని చెయ్యి కూడా చేసుకున్నాడు....

ఆమెకి కళ్ళ వెంట నీళ్లు వచ్చాయ్. ఎవరైనా చూస్తారేమోనని గబుక్కున కర్చీఫందుకుని కళ్లద్దుకోసాగింది.

"నమస్కారం మేడమ్...." పలకరింపుతో వులిక్కిపడి తలెత్తి చూసింది రోహిణి.

ఎదురుగా ఈశ్వర్!

ఆశ్చర్యంతో పాటు ఆనందం కూడా వేసింది.

"నమస్కారం ! రండి కూర్చోండి" పెదాలమీదకి నవ్వు తెచ్చుకుంటూ అంది.

"ఏంటి విశేషాలు? ఎలా వున్నారు? చెప్పండి" ఆమె కెదురుగా వున్న కుర్చీలో కూలబడి.

"ఏమున్నాయ్? అన్నీ మామూలే అన్నట్టు మీరీవూరెప్పుడొచ్చారు?"

"బావగార్ని, చెల్లెల్ని పండక్కి తీసుకెళ్లడానికి వచ్చాను. తిరిగి రాత్రి బండికి వెళ్లిపోతున్నాం. ఈలోపు మిమ్మల్నోసారి పలకరించి పోదామని వచ్చాను. ఇదీ సంక్షిప్తంగా నా రాకకి కారణం" చిన్నగా నవ్వాడీశ్వర్.

ఎంత ప్రశాంతంగా నవ్వుతాడు!

ఇతనికి, బావకి ఎంతో తేడా వుంది. తనని చూస్తే చాలు బావ నవ్వు మొహం కూడా వికృతంగా మారిపోతుంది.

ఈశ్వర్ చిరునవ్వు, బావ చిరాకు చూపులు కంటి ముందు మెదిలాయ్ రోహిణికి.

"ఏంటి మేడమ్! అంత తీవ్రంగా ఆలోచించేస్తున్నారు!" మళ్ళీ చిరునవ్వు.

ఈశ్వర్‌కి తనంటే ఎంత ఇష్టం. అతని సాన్నిధ్యంలో కొంత వరకైనా చిరాకును మర్చిపోవచ్చు. కానీ ఇక్కడింత మంది మధ్యలో అతనితో ఎలా ఫ్రీగా మాట్లాడగలదు?

"మీకింకా పన్లేమైనా వున్నాయా వూళ్లో?" అడిగిందతన్ని.

"మరో ఇద్దరు స్నేహితులున్నారు. వాళ్ళని పలకరించాలి.

"అయితే ఒకపని చెయ్యగూడదూ?"

"ఏంటి?"

"ఇప్పుడు కాస్త బిజీగా వుంది. మీరలా మీ స్నేహితుల్ని చుట్టేసి సాయంత్రం అయిదుగంటలకల్లా వచ్చేశారంటే ఇద్దరం కలసి మా ఇంటి వెళ్ళేప్పుడు మనిష్టం వచ్చినంత సేపు కబుర్లు చెప్పుకోవచ్చు."

"విత్ ప్లెజర్! అలాగే అయిదుగంటల కల్లా వస్తాను" వెళ్ళిపోయా డీశ్వర్.

అతను వెళ్లిపోయినా ఆమె ఆలోచనలన్నీ అతని చుట్టూనే తిరగసాగాయ్ తనంటే అతని కెందు కంత ఆరాధన! తనా రోజు అంత క్రూరంగా ప్రవర్తించినా ఎందుకింకా తనంటే అభిమానం! అసలు ఆరోజు తను చేసింది మంచి పనేనా?

***

ఆ రోజుతో ఫైనలియర్ పరీక్షలైపోతాయ్.

విద్యానగర్ రైల్వే స్టేషన్లో కలిశాడీశ్వర్.

"ఏమండీ! మీతో ఓ విషయం మాట్లాడాలను కుంటున్నాను" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"మాట్లాడండి" తనూ నవ్వింది.

"ఇప్పుడు కాదండీ - పరీక్ష అయిపోయింతర్వాత...."

"ఫర్లేదు, ఇప్పుడు చెప్పండి." అతనేం చెప్పాలనుకుంటున్నాడో తనకి తెలుసు. తనంటే అతనికి వెర్రి ఆరాధననే విషయం తనకే కాదు, క్లాసులో అందరికీ తెలుసు. అతని దగ్గర్నించీ ప్రేమకి సంబంధించిన మాటల్ని ఎప్పుడో ఒకప్పుడు వినాల్సొస్తుందని తనూహించింది.

అతను చదువులోనే కాదు నడవడి విషయంలో కూడా అందరి మన్ననలనీ పొందుతున్న మనిషి అంతకు మించి మంచి ఆస్థిపరుడని కూడా వింది. అయినా తన మనసతనిమీదకి మళ్లడంలేదు.

అందుక్కారణం అతన్లో లోపమేమీకాదు. అప్పటికే తన మనసుని బావ పూర్తిగా ఆక్రమించేశాడు.

అందుకే ఇష్టం వచ్చినట్లేవేవో మాట్లాడి తనమీదున్న అతని అభిప్రాయాన్ని చెడగొట్టాలని నిశ్చయించుకుంది.

"ఇప్పుడు కాదండీ.... పోనీ సాయంత్రం పబ్లిక్ గార్డెన్స్కి వస్తారా?" నసిగాడు.

"ఏంటి? పబ్లిక్ గార్డెన్స్కి రావాలా! మీ ఉద్దేశం...?" తెచ్చిపెట్టుకున్న కోపంతో గద్దించింది తను.

"అబ్బే... అది కాదండీ... దయచేసి వేరేగా అనుకోకండి... మీతో వంటరిగా మాట్లాడాలని అలా అన్నాను. అంతే!" అతన్లో కంగారు అధికమైంది. అతని అవస్థ చూస్తుంటే తనకి నవ్వొస్తోంది.

తనని అతను పెళ్ళి చేసుకోవడమనేది జరగని విషయం. అయినా అతని నోటి నుంచీ అతని కోరికని వినాలని మనసు తహ తహలాడింది.

"ఏం మాట్లాడదల్చుకున్నారో ఇక్కడే మాట్లాడండి" అంది తను.

"ఇవాల్టితో మన పరీక్షలైపోతున్నాయ్ - రేపు మావూరెళ్లి పోతున్నాను. అందుకనీ విషయం మీతో మాట్లాడి.... "

"ఏ విషయం?" కావాలనే అడిగింది తను.

"అదే... మీరంటే నాకు చాలా ఇష్టం. మీక్కూడా ఇష్టమైతే ఈ విషయం మా నాన్నగారికి చెప్పాలని...."

"నా జవాబు చెప్పబోయే ముందు మిమ్మల్నో ప్రశ్న అడుగుతాను. మన క్లాసులో ఎంతో మంది అమ్మాయిలున్నారు మరి, వాళ్ళెవ్వరంటే కలగని ఇష్టం మీకు నేనంటేనే ఎందుకు కలిగింది? నేనెప్పుడూ మీతో సరదాకి కూడా మాట్లాడలేదే!"

దూరంగా లోకల్ రైలు వస్తూ కనిపించింది.

ఆమె అలా అనేసరికి ఈశ్వర్‌కి తల దిమ్మెక్కి పోయినట్లనిపించింది. కోపంతో మొహం జేవురించింది. ఏదో చెప్పాలని నోరు తెరవబోయి, మానుకున్నాడు.

"సారీ మిష్టర్! నా కిటువంటి ప్రేమలున్నా ప్రేమ పెళ్ళిళ్ళన్నా మంచి అభిప్రాయం లేదు" మళ్లీ తనే అంది.

అప్పటి అతని మొహం ఇప్పటికీ తన కళ్ల ముందు మెదుల్తూనే వుంది.

అతని మొహంలోని భావాలు వర్ణనాతీతం. అతన్నంతగా బాధ పెట్టినందుకు తనకే బాధ వేసింది. అయినా తప్పదు అప్పటికే తన మనసు పూర్తిగా బావపరమైపోయింది. మరో మగవాడికి తన మనసులో స్థానం లేదు.

ఇంతలో బండి ప్లాట్‌ఫారం మీదకి రావడంతో తను లేడీస్ కంపార్ట్‌మెంట్‌లోకి, అతను పక్క కంపార్ట్‌మెంటులోకి ఎక్కారు.

అంతే! అప్పట్లో మళ్లీ అతను కనిపించలేదు.

పరీక్షలైపోగానే తనకి బావతో పెళ్లైపోయింది. పెళ్ళికి ఆహ్వానిస్తూ ఈశ్వర్‌కి శుభలేఖ పంపింది.

'నాకు కొన్ని అర్జంటు పనులుండడం వల్ల వివాహానికి రాలేకపోతున్నానని, మీ వివాహ జీవితం ఎంతో మాధుర్యాన్ని నింపుకుని సెలయేరులా సాగిపోవాలని కోరుకుంటున్నా'నని వుత్తరం రాస్తూ- రాధా కృష్ణుల ఎనామిల్ పెయింట్‌ని బహుమతిగా పంపించాడు.

ఆ తర్వాత తనకి వుద్యోగం వచ్చిందని తెలిసినప్పుడు కూడా వుత్తరం ద్వారా తన సంతోషాన్ని తెలియజేశాడు.

ఒకటికి రెండుసార్లు పనిగట్టుకుని ఆఫీసుకొచ్చి పలకరించి వెళ్లాడు. అతడ్ని చూస్తుంటే జాలితో పాటు అభిమానం కూడా కలుగ సాగింది.

ఇతన్ని కాదని బావని చేసుకోవడంలో తప్పు చేశానేమో - ఈ ఆలోచన రాగానే ఇంక ఆలోచించలేక పోయింది రోహిణి.

బలవంతాన ఆ ఆలోచనలని మనసులోనుంచి తోసివేయడాన్కి ప్రయత్నిస్తూ ఎదురుగా వున్న ఫైలందుకుంది.

***

సరిగ్గా అయిదు నిముషాలు తక్కువ అయిదు గంటల కొచ్చాడీశ్వర్.

అతన్ని చూడగానే రోహిణి గుండెలు ఆనందంతో కొట్టుకోసాగాయ్.

"మీ పనైపోయిందా? ఇంక మనం బయల్దేరవచ్చా?" అడిగాడతను.

"వన్ మినిట్" టేబుల్ సర్ది, సొరుగు లాక్ చేసి బయల్దేరింది.

ముందతను, వెనుక తను!

ఇలా ఆఫీసుకొచ్చి తీసుకెళ్లమని ఎన్నిసార్లు బ్రతిమాలింది బావని.

'ఆఫీసొదలగానే నా కింకేమీ పనుండదనుకున్నావా. నిన్ను స్కూటర్ మీద తిప్పడం తప్ప' భర్త చిరాకు మొహం కనిపించేసరికి ఆమెలోని వుత్సాహం నీరుగారి పోయేది.

"మీరీ పూట నా మాట కాదనగూడదు. మీ ఇంటి దాకా సరదాగా కబుర్లు చెప్పుకుంటూ నడిచిపోదాం" ఈశ్వర్ ఆశగా రోహిణి వంక చూస్తూ అన్నాడు.

రోహిణికి అతన్ని నిరుత్సాహపరచాలనిపించలేదు. అదీగాకుండా తనకీ వెంటనే ఇంటికి వెళ్లాలని పించడం లేదు. అందుకే మవునంగా తలూపింది!

ఇద్దరూ నడుస్తూ బయల్దేరారు కబుర్లు చెప్పుకుంటూ.

అతనేమో చెప్తున్నాడు. ఆమె వింటోంది.

మధ్య మధ్య ఆమె నవ్వుతోంది. అతను పరవశించి పోతున్నాడు.

"కాస్త కాఫీ తాగి వెళ్దాం" దార్లో కామత్ హోటల్ చూస్తూ అన్నాడతను.

"పదండి...." ఆమెకీ కాఫీ తాగాలనిపించింది.

ఇద్దరూ కామత్‌లోకి దారితీశారు.

"టిఫినేమైనా తీసుకుంటారా?" అడిగాడతను.

"నా కక్కర్లేదు. మీరేమైనా తీసుకుంటే తీసుకోండి."

"రెండు కాఫీ...." ఆర్డరిచ్చాడతను.

ఇద్దరూ ఏవేవో కాలేజీ నాటి విషయాలు మాట్లాడుకొని నవ్వుకున్నారు.

కాఫీ తాగడం పూర్తి చేసి ఇద్దరూ లేచారు. ఆమె వద్దంటున్నా అతనే బిల్లు చెల్లించాడు.

ఆమె మనసెంతో ఆనందంగా వుంది.

అతనికీ ఎంతో తృప్తిగా వుంది.

ఇద్దరూ హుషారుగా కబుర్లు చెప్పుకుంటూ నల్లకుంట దాకా నడిచి వచ్చారు.

కూరల బండ్లని చూడగానే ఆమె ఠక్కునాగిపోయింది. ఆమెతోపాటు అతనూ ఆగిపోయాడు.

'కనీసం కూరలు కూడా ఆయన - తేరు. ఇంటి పన్లన్నీ తనే చూసుకోవాలి. ఏ మాత్రం లోటు కనిపించినా నానా గొడవా చేస్తారు. పొద్దునకి పొద్దున ఇంట్లో కూరచేయలేదని ఎంత గొడవ చేశారూ!'

పొద్దున విషయం గుర్తుకు రాగానే రోహిణి మనసు మళ్లీ చికాకైపోయింది.

ఎదురుగావున్న కూరల బండి కేసి నడిచింది.

"టమోటాలెలా?" అడిగింది.

చెప్పాడతను.

ఏరి బుట్టలో వెయ్యసాగింది. తను కూడా కాయల నేరడంలో ఆమెకు సహాయపడసాగాడీశ్వర్.

అవన్నీ తూయించి సంచీలో వేయించుకుంది రోహిణి. హఠాత్తుగా డబ్బుల్ని తీసి కూరలతనికిచ్చాడీశ్వర్.

"ఇందాక హోటల్లో ఇచ్చారంటే అర్థముంది. ఇక్కడ కూడా డబ్బులు మీరే ఎందుకిచ్చారు?" ఆశ్చర్యంగాను, చిరుకోపంగాను అడిగిందామె.

"జీవితాంతం మీరు కొనే వస్తువులన్నింటికీ నేనే డబ్బులివ్వాలనుకున్నాను. ఆ అదృష్టం నాకెలానూ లేదు. కనీసం ఈ ఒక్క పూటైనా ఆ అనుభూతిని పొందనీయండి" అన్నాడతను జీర పోయిన గొంతుతో మొహం పక్కకి తిప్పేసుకుంటూ.

ఆ మాట లామె గుండెల్ని తాకాయ్. కళ్ల వెంట నీళ్లు తిరిగాయ్. ఏమీ మాట్లాడలేకపోయింది.

రెండడుగులు వేయగానే "మరి నే వస్తా" అటుగా పోతున్న ఆటోను నిలిపి, ఎక్కుతూ అన్నాడీశ్వర్.

అతన్నాగమనాలని, ఏమేమో చెప్పాలని అనిపించిందామెకి. అయినా మాట్లాడలేకపోయింది.

అటో వాళ్ళిద్దరి మధ్యా దూరాన్ని పెంచుతూ సర్రున దూసుకు పోయింది.

ఇంటికి జేరుకుని నీరసంగా పడక్కుర్చీలో వాలిపోయింది రోహిణి. రకరకాల ఆలోచన్లామె మనసుని ముసరసాగాయ్.

ఈశ్వర్‌కి పెళ్ళైపోయింది. అతని భార్య అతన్ని ఖచ్చితంగా ఆరాధిస్తూనే వుంటుంది. ఈశ్వర్ తనని ప్రేమిస్తున్నాడు. తను బావని ప్రేమించింది. బావ మరెవర్నో ప్రేమిస్తున్నాడు. కోరుకున్న వాళ్ళెవ్వరికీ దొరకలేదు. కనీసం దొరికిన వాళ్ళతో రాజీ కూడా పడడం లేదు.

జీవితంలో తలచినవన్నీ జరగకపోవచ్చు. అంత మాత్రాన నిరుత్సాహ పడిపోయి, తనతో పాటే తనని నమ్ముకున్న వాళ్ళని కూడా బాధ పెట్టడం అవివేకం.

ఈశ్వర్ ఇంకా తనని పూర్వం లాగానే ప్రేమిస్తున్నాడని ఆనందపడిందేగాని తనలాగే మరో స్త్రీ ఇరుకునబడి నలిగిపోతోందని ఆలోచించలేదు. సరిగ్గా తను బావతో పడుతున్న బాధనే ఈశ్వర్ భార్యకూడా ఈశ్వర్ వల్ల పడుతూంటుంది.

తనకిలాగానే ఆమె బాధ పట్టానికి వీల్లేదు.

వెంటనే కాగితం, కలం అందుకొంది రోహిణి.

ఈశ్వర్ గార్కి -

యవ్వనంలోకి అడుగు పెట్టింతర్వాత వయసు వ్యామోహంలో ప్రతిమనిషీ ఎవర్నో ఒక్కర్నైనా ప్రేమించక తప్పదు. ఒక్క మాటలో చెప్పాలంటే అది ప్రేమ కాదు ఆకర్షణ. వయసు వ్యామోహంలోంచి బయట పడాల్సిన వయసులోకి అడుగుపెట్టాం. జీవితంలో జరగని విషయాల గురించి ఆలోచించి బాధపడడం అవివేకం. అదీ కాకుండా

మనం ప్రేమించిన వాళ్లు మనకు భాగస్వాములుగా దొరకడం అదృష్టం. దొరికిన అదృష్టాన్ని కాలదన్నుకోవద్దు. మీ పూర్తి ప్రేమకి పాత్రురాలు ఆమె మాత్రమే! ఇదే ఓ మంచి స్నేహితురాలిగా నా సలహా-

రోహిణి.

ఉత్తరాన్ని ముగించి; కవర్లో పెట్టి అంటించి, దాన్ని వెంటనే దగ్గర్లో వున్న పోస్ట్ డబ్బాలో వేసివస్తేగాని ఆమె మనస్సు కొద్దిగానైనా తృప్తి పడలేదు.

*

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక 24-11-78)

# వయసు తలపుల తలుపులు

రూమ్‌కి తాళం వేసి రోడ్డు మీదకి రాగానే రాజేంద్ర కళ్ళు అప్రయత్నంగా ఎదురింటి కిటికీ వేపు మళ్ళాయి.

ఆమె అక్కడే నిల్చొనుంది!

ఈ కొత్త రూమ్‌లోకి వచ్చిన వారం రోజుల్నించీ తను గమనిస్తూనే వున్నాడు. సరిగ్గా తను ఆఫీస్‌కి బయల్దేరే టయిమ్‌కి ఆమె వచ్చి అక్కడ నిలబడుతుంది.....!

ఆమెను చూసి చిన్నగా నవ్వేడు.

ఆమె నవ్వింది.

చటుక్కున అతనికి తను రోడ్డుమీద నిలబడున్నాడనే విషయం స్ఫురణకి వచ్చింది. దాంతో బలవంతాన మనసుని అదుపులో పెట్టుకుంటూ ముందుకు నడవసాగాడు. అతని ఆలోచనలు మాత్రం ఆమె వేపే పరుగెడుతున్నాయి.....

తనా రూమ్‌లోకి వచ్చిన సాయంత్రం గేటు దగ్గర నిలబడ్డాడు పరిసరాల్నిగమనిస్తూ.

ఎదురింట్లో ఒకతను బయటికొచ్చేడు.

వెనుకే అతని భార్య అయుంటుంది.

అతనెంత నలుపో, ఆమె అంత తెలుపు.

కాకి ముక్కుకి దొండపండు!

అతని మీద ఈర్ష్య, ఆమె మీద జాలి ఒకేసారి కలిగాయి తనకి. అలాగే వాళ్ళని చూస్తూ నిలబడ్డాడు.

అతను-

కొద్ది అడుగులు వెనగ్గా ఆమె-

వెళ్తున్నారు.

వాళ్ళనే చూస్తూ తను......!

చటుక్కున ఆమె వెనక్కి తిరిగి చూసింది-వెళుతూనే!

తను రెడ్ హాండెడ్‌గా ఆమెకు దొరికిపోయాడనిపించింది. ఠక్కున లోపలికి వచ్చేశాడు. అయినా ఆమె గురించి ఆలోచించడం మాత్రం మాన్లేదు.

బహుశా పరిస్థితుల ప్రభావం వల్ల అతన్ని చేసుకొని వుంటుంది. అందుకే అతనితో జీవితానికి రాజీ పడలేకపోతోంది....

ఈ ఆలోచన ఆమె మీద జాలి, ఆమె భర్త మీద కోపం కలిగించడంతో పాటు తనకి ఆనందాన్ని కూడా కల్గించసాగింది.

తన నామె ఆకర్షించినట్లే, ఆమెని తనూ ఆకర్షించాడు. అందుకే అలా వెనక్కి చూసింది! ఆ క్షణంలోనే తనకామె మనసు అర్థమైపోయింది. అప్పట్నించీ ఆమె రాజేంద్ర మనసులో తిష్ఠ వేసుక్కూర్చుంది. అందుకని అటుగా వచ్చేప్పుడు, పోయేప్పుడు అతని కళ్ళు అప్రయత్నంగా అటు చూస్తాయి.

రోజు రోజుకీ ఆమెకీ, తనకి మధ్య దూరం తరుగుతున్నట్లనిపించింది రాజేంద్రకి.

మొదటి రోజు వెనక్కి తిరిగి చూసింది.

రెండో రోజు కిటికీ దగ్గర నిలబడుతున్నదల్లా తనని చూస్తూపక్కకి తప్పుకుంది.

మూడో రోజు మనిషి పక్కకి తప్పుకోకుండా చూపుల్ని మాత్రం పక్కకిమరల్చింది...

నాల్గోరోజు తననే చూస్తూ నిలబడుంది. తనే కొద్దిగా కంగారు పడ్డాడు.....

అయిదోరోజు తనకి ధైర్యం వచ్చేసింది. చూపులు కలిశాయి....

ఇవాళ నవ్వులు విరిసాయి.....

ఇంక ఆలస్యమ్ అమృతమ్ విషమ్ అనిపించింది రాజేంద్రకి.

సాయంత్రం ఆఫీస్ నించి పెందరాడే ఇంటికి వచ్చేయాలి. అప్పటికి ఆమె భర్త రాడు కాబట్టి ఆమెతో మాట్లాడే అవకాశం దొరుకుతుంది....

ఈ నిశ్చయానికి రాగానే అతని పెదవుల మీద నవ్వు విరిసింది.... మనసుకి సిగ్గేసింది. తియ్యటి ఆలోచన్లు మదిలో రొద చేస్తుంటే అతనికి తెలీకుండానే అడుగులు ముందుకు పడుతున్నాయి...

బస్టాప్‌కి చేరుకోగానే అతని ఆలోచన్లు చెదురు మదురు అయ్యాయి.

తోపిడి-త్రొక్కిసలాట - ఈ రోజు బస్సు ప్రయాణం అతనికి నరకంగా అనిపించలా.....

ఆఫీస్‌కి చేరుకున్న తర్వాత కూడా అతన్ని ఆలోచన్లు విడిచిపెట్టలేదు.... బలవంతాన గడపసాగాడు టైమ్‌ని - పని చేస్తున్నట్లు నటిస్తూ....

మూడు గంటలకల్లా పర్మిషన్ తీసుకుని బయటికి వచ్చాడు.

బస్సుకోసం ఎదురు చూడాలనిపించలేదు. ఆటోలో బయల్దేరాడు....

ఆటో ఆగగానే శబ్దానికి ఆమె బయటికి వచ్చింది. పిలుస్తున్నట్లుగా చెయ్యూపింది.

తననేమోనని తల మునకలైపోయాడు రాజేంద్ర.

కానీ ఇంతలో ఆటో వెళ్ళిపోవడంతో అవతల నిలబడున్న పక్కింటి కుర్రాడు కనిపించాడు.

ఆమె మళ్ళీ రమ్మన్నట్లు చెయ్యూపింది.

ఆ కుర్రాడటు పరుగెత్తాడు.

నీరసంగా కదిలాడు రాజేంద్ర.

రూమ్‌కి తాళం తీసి లోపలికి అడుగు పెట్టగానే "అంకుల్....." అంటూ పరుగెత్తుకొచ్చాడు ఇందాకటి కుర్రాడు.

"మీకు ఆ ఆంటీ ఈ కాగితాన్ని ఇమ్మన్నారు....." అంటూ చేతిలో ఓ కాగితాన్ని కుక్కేసి ఎంత వేగంగా వచ్చాడో, అంత వేగంగానూ వెళ్ళిపోయాడు.

వణుకుతున్న చేతుల్తో ఆ కాగితాన్ని విప్పేడు రాజేంద్ర.

"మా ఆయన వూళ్ళో లేరు.... మీరు చీకటి పడ్డం తర్వాత రండి. ఎదురు చూస్తూ వుంటాను....."

అతనికి ఇది కలా? నిజమా? అన్నంత అనుమానం వచ్చింది. మళ్ళీ మళ్ళీ ఆ వుత్తరాన్ని చదివేడు.

వెదకబోయినతీగకాలికితగిలింది.....

ఆనందంతో అతని మనసు గంతులు వేయసాగింది.

ఆ వుత్తరంతో పాటు మంచం మీద వాలిపోయాడు.

**ఉత్తరం...**

రంగుల కలలు...

ఎన్ని సార్లు ఉత్తరాన్ని చదివినా, ఎన్ని కలలు గన్నా టైమ్ గడవడం లేదు.

శుభ్రంగా స్నానం చేశాడు.

నీట్‌గా డ్రస్ చేసుకున్నాడు.

ఇంకా పొద్దు గూకలేదు....

నెమ్మదిగా నడుస్తున్న టైమ్‌ని తిట్టుకుంటూ వరండాలో కుర్చీ వేసుకుని కూర్చున్నాడు.

మళ్ళీ ఆమె వాకిట్లోకి కూడా రాలేదు. బహుశా తనలాగానే ఆలోచనల్లో సతమతమై పోతోందేమో అనిపించిందతనికి.

సెకెండ్లు....

నిముషాలు....

గడుస్తున్నాయి బరువుగా.

చీకట్లు కమ్ముతున్నాయి.

రాజేంద్ర మొహం మాత్రం ఆనందంతో వెలిగిపోతోంది.... ఆలోచనల అలలు మాత్రం అతన్ని ఇబ్బంది పెట్టేస్తూనే వున్నాయి.....

"పట్టుకోండి... పట్టుకోండి," అరుపుల్తో వులిక్కిపడి బయటికి వచ్చాడు రాజేంద్ర.

ముందొకతను పరుగెత్తుకొస్తున్నాడు.

అతన్ని పట్టుకోవడానికి వెనక చాలామంది.

"పట్టుకోండి... పట్టుకోండి, దొంగ" అరుస్తున్నారు.

పరిస్థితి అర్థమైపోయింది రాజేంద్రకి.

చటుక్కున రోడ్డుమీదకి వురికి అప్పుడే అక్కడికి చేరుకున్న అతన్ని గట్టిగా పట్టేసుకున్నాడు....

ఇంతలో జనం చుట్టు ముట్టేశారు.

దొంగ చేతులు మారాడు.

ఎవరిష్టం వచ్చినట్లు వాళ్లు కొట్టసాగారు.

"ఎవరి వస్తువుల కోసమో ఆశపడక పోతే కష్టపడి పని చేసుకోకూడదూ....?"

"ఇటువంటి దొంగ బతుకు బతికేకన్నా చావడం నయం....."

ఎవరిష్టం వచ్చినట్లు వాళ్ళు తిట్టసాగారు.

రాజేంద్రకి అక్కడ నిలబడాలనిపించ లేదు. రూమ్‌లోకి వచ్చేశాడు.

పోలీస్ స్టేషన్లో అప్పజెప్పడానికి కాబోలు దొంగని బలవంతాన లాక్కుంటూపోతున్నారు....

జనం, గోల క్రమంగా తగ్గింది.

రాజేంద్ర మనసులో కొత్త అలజడి రేగింది.

"దొంగ.... దొంగ...." అతని చెవుల్లో మారుమ్రోగుతోంది.

అతనికి, తనకి తేడా ఏమిటి?

ఈ ఆలోచన ఛెళ్లున చెంప మీద చరిచినట్లనిపించిందతనికి.

తనూ కొద్దిసేపట్లో ఎదురింట్లో దొంగతనానికి బయల్దేర బోతున్నాడు. తమ విషయాన్ని ఎవరైనా పసిగట్టేరంటే....?

తనూ ఇలాగే నలుగురి ముందూ అవమానాన్ని భరించాల్సి వుంటుంది. తనందుకు సిద్ధంగా లేడు.....

చటుక్కున కుర్చీలోంచి లేచాడు.

గబగబా రూమ్‌కి తాళం వేసి రోడ్డు మీదికి వచ్చాడు.

ఎదురింటి గుమ్మంలో ఆమె నిలబడుంది.

అటు వేపు చూడాలన్నా భయమనిపించింది రాజేంద్రకి. చరచరా ముందుకి వెళ్ళిపోయాడు - రోడ్ల మీద కాసేపలా అలా తిరిగివద్దామని! *

(జ్యోతి మాసపత్రిక - ఏప్రిల్ 1982)

# వయస్సు కోరిక

"అయిదయి పోయింది. ఇంకా ఏంటి రాస్తూ కూర్చున్నావ్!" మాధురి పలకరింపుతో తుళ్ళిపడి ,వాచీ చూసుకుంది మాధవి.

అరే! అప్పుడే ‹ అయిదయిపోయిందే! తనివాళ పూర్తి చేయాలనుకున్న వర్క్ ఇంకా పూర్తవలేదు....

ఎక్కడవుతుందీ? అవ్వదు. ఈ సీట్ మహాత్యం అది! ఎంత చేసినా వర్క్ అలా పుట్టుకొస్తూనే వుంటుంది. ఇంక ఇవాళ లాభం లేదు... రేపే!

"ఏవండోయ్! మేం మీ కోసం ఎదురు చూస్తున్నాం. మీరు వస్తారా? రారా?" మీధకి వంగి మాలతి కాస్త గట్టిగా అనడంతో ఆలోచనల్లోంచి బయటపడింది మాధవి.

"ఇదిగో వచ్చేస్తున్నాను...." గబగబా టేబుల్ని సర్ది, సొరుగును లాక్ చేసింది.

"హమ్మయ్య! మొత్తానికి పెందలాడే ముగించావ్ నీ సర్దుడు కార్యక్రమాన్ని." నవ్వింది మాధురి.

"తప్పదుగా...." తనూ నవ్వింది మాధవి.

ముగ్గురు వెళ్లాల్సింది మూడు మూలలకి. అయినా ఆఫీస్‌లోంచి ఒకేసారి బయటపడడం ముగ్గురికి అలవాటు. నాలుగడుగులు వేసి బషీర్‌బాగ్ చేరుకోగానే ఎవరి బస్టాప్ వైపు వారు వెళ్లిపోతారు. ఈ లోపే మాట్లాడుకోవాలి ఏం మాట్లాడుకున్నా.....!

"అవునూ! హీరోగారు ఇవాళ రానట్లున్నారే!" గేటు దగ్గరకు రాగానే అటు, ఇటు చూస్తూ అంది మాధురి.

"ప్చ్... రాలేదు" బరువుగా నిట్టూర్చింది మాలతి.

"ఏలనో పాపం?" వెంటనే విచారం వెలిబుచ్చింది మాధురి.

"ఏం అర్జంటు పని తగిలిందో....?" మాలతి జవాబు.

వాళ్ళ మాటలు వింటుంటే మాధవికి వుడుకుమోతుతనంగానూ వుంది, ఆనందంగానూ వుంది.

తనని చూడందే ఒక్క రోజుకూడా వుండలేడు ఈశ్వర్. సరిగ్గా అయిదు గంటలకల్లా ఆఫీస్ బయట ప్రత్యక్షం! వీళ్ళు తనని గోల చేస్తున్నారని చెప్పినా వినిపించుకోడు.

"ఎంత అర్జంటు పనయితే మాత్రం ఇక్కడ పాపం ఈ రాణిగారి బాధ గురించి కూడా ఆలోచించవద్దూ ఆ మహానుభావుడు?" నవ్వుతూ అంది మాధురి.

"మాధురీ! అటు చూడు...." మాధురి మాటలకి మధ్యలో అడ్డుపడుతూ దూరంగా వున్న బస్టాప్ కేసి చూపించింది మాలతి.

మాధురితో పాటు మాధవి చూపులూ చటుక్కున అటు మళ్ళాయ్.

ఈశ్వర్ నిలబడున్నాడు అక్కడ!

అతన్ని చూడగానే సిగ్గుపడిపోయింది మాధవి.

"రాజాగార్ని అపార్థం చేసుకున్నాం. క్షమించండి రాణిగారూ.... బై..... బై...." నవ్వుకుంటూ మాధురి, మాలతి విడిపోయారు.

వంటరిగా వస్తున్న మాధవిని చూడగానే విప్పారిన మొహంతో ఎదురొచ్చిడీశ్వర్"గుడీవినింగ్ మేడమ్...."

"మిమ్మల్ని ఇలా రోజూ ఆఫీస్ వేపు రావద్దన్నానా? చిరుకోపంగా అడిగింది.

"మీ ఇంటికి రావడానికి వీల్లేదు. ఆఫీస్‌కి రోజూ రావడానికి వీల్లేదు. మరిలా రోడ్డు మీదైనా కల్సుకోకపోతే నేనేమైపోవాలి?"

"మరేం పర్లేదు. ఇలా మీరు రోజూ ఇక్కడికి వస్తూంటే మా ఆఫీస్ వాళ్ళు చూసి, ఏమనుకుంటున్నారో తెల్సా?"

"పెళ్ళయిన వాళ్ళైతే ఈడు జోడు బావుందని ముచ్చటపడతారు. పెళ్ళి కాని వాళ్ళయితే ఈర్ష్యపడతారు. అయినా ఇంట్లో వాళ్ళు చూస్తే భయపడాలిగాని, ఆఫీస్‌లో వాళ్ళు చూస్తే భయపడాలా?"

"అదిగో నా బస్ వచ్చేస్తోంది....."

"మాధవీ! ప్లీజ్.... నీ కోసం ఆఫీస్ అయ్యీ అవకముందే ఆటోలో పడి మరీ ఇక్కడికి పరుగెత్తుకొచ్చాను. కోఠీ వరకూ నడిచి వెళ్దాం. అక్కడ్నించి నీవు బస్‌లో వెళ్ళిపో"

బస్సొచ్చి ఆగింది.

అయినా అటువేపు కదల్లేదు మాధవి. ఆమెకూ అతన్తో నడిచి వెళ్ళడమే సరదా! కానీ తన మనసు పూర్తిగా బయటపడితే ఎక్కడ చులకనైపోతానో అని భయం.

"నేన్రాను"

"ప్లీజ్" బ్రతిమాలాడతను. బస్ వెళ్ళిపోయింది.

అతను... అతని పక్కన ఆమె.... ఇద్దరూ నడుస్తూ బయల్దేరారు.

అలా కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ నడుస్తుంటే ఇద్దరికీ ఎంతో ఆనందంగా వుంది. తమకి తెలీని వాళ్ళు తమవంక చూస్తుంటే గర్వంగా ఉంటుంది. తెలిసిన వాళ్ళు ఎక్కడ చూస్తారో అనే భయం కూడా దాన్నంటి పెట్టుకునే వుంది.

"రేపాదివారం కదా!. నీ ప్రోగ్రాం ఏంటి?" మౌనాన్ని ఛేదిస్తూ అడిగాడు ఈశ్వర్.

"ఏమీలేదు"

"అయితే రెండు గంటలకల్లా రామకృష్ణా థియేటర్ దగ్గరికి వచ్చేయ్. నేను టికెట్లు తీసుకుని సిద్ధంగా వుంటాను."

"అమ్మో! సినిమాకా? నీతోనా? ఎవరైనా చూస్తే?"

"మరేం పర్లేదు ఆ మూలకి మనకి తెల్సిన వాళ్ళెవ్వరూ రారు"

"వస్తే.....?"

"వాళ్ళ ఖర్మ"

"వాళ్ళ ఖర్మకాదు మన ఖర్మ. మాధవి అతనెవర్తోనో సినిమాలకి, షికార్లకీ తిరుగుతోందనే విషయం నిముషాల మీద వూరంతా పొక్కిపోదూ?"

"పొక్కిపోని. అప్పుడించక్కా ధైర్యంగానే షికార్లు కొట్టేయొచ్చు."

"నా వల్ల కాదు. ఇంట్లో తెలిస్తే బావుండదు. నేనేమి మగవాణ్ణి కాను. పెళ్ళి కావల్సిన ఆడపిల్లని...."

"మాధవీ.... ప్లీజ్.... రేపు నా పుట్టిన రోజు. నన్ను డిజప్పాయింట్ చెయ్యొద్దు. నా సెంటిమెంటుమీద దెబ్బ కొట్టొద్దు.... ప్లీజ్...."

"ఆల్‌రైట్ వస్తాను. కానీ సినిమా అయిపోగానే వెంటనే నన్నింటికి పంపించెయ్యాలి. మళ్ళీ హోటల్, పార్కులు అంటే...."

"అనను. సినిమా అయిపోగానే వెళ్ళిపోదువు గాని....."

"సరే!"

"థాంక్యూ"

ఇద్దరూ కామత్‌లోకి దారితీసారు.

అలవాటుగా సరాసరి అదే టేబుల్ దగ్గర కెళ్ళి కూలబడ్డారు. రోజూ అదే టయిమ్‌లో, అదే హోటల్‌కి వచ్చి, అవే కుర్చీల్లో కూర్చోవడం అదో సరదా!

"ఏంకావాలిసార్?" సర్వర్ వచ్చాడు.

అతను రోజూ తమని చూస్తూనే వున్నాడు. కాఫీ తప్ప అక్కడ మరేమీ తీసుకోరని అతనికీ తెల్సు. అయినా రోజూ చూడగానే అలా అడుగుతూనే వుంటాడు. అది అతని విధి!

"రెండు కాఫీ" ఆర్డరిచ్చాడు ఈశ్వర్.

"ఇంకా ఏంటి విశేషాలు?" అడిగింది మాధవి.

"ఏమున్నాయ్! అంతా మామూలే! ఇంటి దగ్గర మాత్రం 'పెళ్ళి పెళ్ళి' అని ఒకటే గోల!" చిన్నగా నవ్వాడీశ్వర్.

"అబ్బబ్బ మా ఇంట్లోనూ అదే పెళ్ళిగోల! పెళ్ళి.... పెళ్ళి...."

"అయితే ఒక పని చెయ్యి"

"ఏంటీ!" ఆత్రంగా అడిగిందామె.

"వెంటనే పెళ్ళి చేసుకో....."

"ఆ విషయం నాకూ తెల్సు. నువ్వేం చెప్పక్కర్లేదు". కోపంతో మూతి మూడు వంకర్లు తిప్పిందామె.

ఆమె అలా మూతి తిప్పితే అతనికదో ఆనందం!

అంతలో సర్వర్ కాఫీలు తెచ్చాడు.

"నువ్వలా చిరుకోపంతో చూస్తుంటే నాకేమనిపిస్తుందో తెల్సా?" కాఫీని సిప్ చేస్తూ అడిగాడతను.

"ఏమనిపిస్తుంది?"

"ఇక్కడ. ఇంతమంది ముందు చెప్పడం కష్టం" చిన్నగా నవ్వాడతను. సిగ్గు పడిపోయిందామె. ఆ సిగ్గులో కొరబోయింది. చటుక్కున ఆ గ్లాసు నందుకుని సిప్ చేసి పెట్టేశాడు ఈశ్వర్.

ఆ టేబుల్ మీద వున్నది అదొక్కటే గ్లాస్! తప్పదు! ఆ గ్లాస్నే ఖాళీ చేసేసిందామె.

ఆమె గ్లాసుని టేబుల్ మీద పెట్టేలోపునే కాఫీ కప్పులు తారు మారయ్యాయి. ఇద్దరి కళ్ళలోనూ తృప్తి.

కాఫీ ముగించి ఇద్దరూ కోఠీ వేపు బయల్దేరారు కబుర్లు చెప్పుకుంటూ.

సెకండ్లు.... నిమిషాలు.....

దూరం కరిగిపోయింది. గమ్యం వచ్చేసింది.

ఇక ఇద్దరూ విడిపోవాలి.

తప్పదు!

ఇద్దరి గుండెల్లోనూ దిగులు...

మళ్ళీ కల్సుకోవడానికి దాదాపు ఇరవై నాల్గుగంటల వ్యవధి!

ఇంతలో ఆమె ఎక్కాల్సిన బస్సు రానే వచ్చింది. ఆమె నెక్కించుకుని బస్ వెళ్ళిపోతూంటే దిగులుగా చేయి ఊపాడీశ్వర్.

***

"ఏరా! ఇంకెన్నాళ్ళు. వచ్చేనెల దాటితే మళ్ళీ ముహూర్తాలు లేవు. ఆ సంబంధం మీద అసలు నీ అభిప్రాయమేంటో తేల్చేయ్ ఇవాళ" రాత్రి భోజనాల దగ్గర నిరంజనంగారడిగారు ఈశ్వర్ని.

"ఇది ఒక్క రోజుకి సంబంధించిన విషయం కాదు కదా నాన్నా. నాకు కొద్దిగా టైమ్ కావాలి"నసిగాడు ఈశ్వర్.

"ఇంకెంత కాలం? నెల దాటిపోయింది, మనం ఆ సంబంధం చూసివచ్చి. మనకి తొందర లేకపోయినా ఆడ పిల్ల గల వాళ్ళు వాళ్ళకి తొందర వుంటుంది.... రేపొక్క రోజు టైమిస్తున్నాను. ముహూర్తం పెట్టేయమని నేనే కబురు చేస్తాను ఆ తర్వాత...." భోజనం అయిపోవడంతో నిరంజనంగారక్కడి నుంచి వెళ్లి పోయారు.

తన పెళ్ళి విషయంలో కూడా తనకి పూర్తి స్వాతంత్ర్యం ఇవ్వకుండా ఆయనలా ఖండితంగా మాట్లాడేసరికి వుక్రోషం ముంచుకొచ్చింది ఈశ్వర్‌కి. తండ్రికి జవాబు చెప్పలేదు. తల్లికి చెప్పి లాభం లేదు. నిస్సహాయంగా చేయి కడిగేసుకుని లేచి వెళ్లిపోయాడు.

ఆ రాత్రంతా అతనికి సరిగ్గా నిద్ర పట్టలేదు.

రేపొక్కరోజే తనకి టైమ్!

ఈ విషయాలన్నీ రేపే మాధవికి చెప్పేయాలి. రకరకాల ఆలోచనల్తో అర్థరాత్రి దాటింతర్వాత ఎప్పుడో నిద్రపట్టింది.

మర్నాడు లేచింది మొదలు దిగులు.

ఈ ఒక్కరోజే గడువు. తను చెప్పక పోయినా తండ్రే నిశ్చయించేస్తాడు. ఆయనచేత బలవంతాన వప్పించబడే బదులు తనే వప్పుకోవడం మేలు కదా!

ఇప్పుడు వప్పేసుకుంటే ఆ విషయం మాధవికి చెప్పొద్దూ? ఆమె ఏమంటుందో తననెలా అర్థంచేసుకుంటుందో?

ఆమెకన్ని విషయాలూ చెప్పేయాలి. అప్పుడామె ఎలా చెబితే అలా నడుచుకోవాలి. అదొక్కటే మార్గం! చివరికానిశ్చయా కొచ్చాడీశ్వర్.

ఒంటిగంట నుంచే రామకృష్ణా దగ్గర నిలబడి ఆమె కోసం ఎదురుచూడసాగాడు.

కాలం చాలా భయంకరంగానూ, బాధాకరంగానూ నడుస్తోంది.

దాదాపు రెండు గంటల ప్రాంతంలో వచ్చింది మాధవి.

ఆమెను చూడగానే అతని మనసులో ఆనందం, బాధ- రెండూ చోటు చేసుకున్నాయ్.

ఆమెకి విషయం చెప్పేయాలి.

ఎలా?

"మాధవి!" బాధగా అన్నాడీశ్వర్.

"ఏమిటి?" చకితురాలై అడిగింది మాధవి.

"మన సినిమా ప్రోగ్రామ్ కాన్సిల్ చేద్దాం"

"ఎందుకూ?"

"మనం సీరియస్‌గా మాట్లాడుకోవాలి"

"దేన్ని గురించి?"

"అదే - మన భవిష్యత్తు గురించి"

"దానికెమయిందిప్పుడు?"

"మా నాన్నగారు వార్నింగిచ్చారు. ఇవాళ సాయంత్రంలోగా ఏదో ఒకటి తేల్చి చెప్పేయమన్నారు. ఏం చెప్పినా, ఎలా చెప్పినా వచ్చే నెల్లోనే వివాహం జరిగిపోవాలట....."

మాధవి నీరసపడిపోయింది.

"అయ్యో! మరిప్పుడేం చేద్దాం?"

"పద. ముందు పార్క్ కెళ్లి కూర్చుని అప్పుడు మాట్లాడుకుందాం"

ఇద్దరూ ఆటోలో పార్క్‌కి చేరుకున్నారు. మధ్యాహ్నం సమయం కావడం వల్ల నిర్మానుష్యంగా వుంది పార్క్.

"ఇప్పుడు చెప్పు మాధవీ! ఏం చేద్దామంటావ్? అడిగాడీశ్వర్.

"నాకేమీతోచడం లేదు. మీరే ఆలోచించండి"

"పోనీ మనిద్దరం ఎక్కడికయినా పారిపోదామా?"

"అమ్మో" తుళ్ళి పడింది మాధవి.

"ఏం! భయమెందుకు? ఆమాత్రం ధైర్యం చేయకపోతే ఎలా? మన ప్రేమ పూర్తిగా ఫలించాలని నువ్వు కోరుకోవడం లేదూ?"

"ఊహూ! ఎక్కడికైనా వెళ్లి పోవడానికి నేనొప్పుకోను" ఆలోచిస్తూ అంది మాధవి.

"అంతేనా?" విచారంగా అడిగాడు ఈశ్వర్.

"అంతే! నా వల్ల కాదు బాబూ. ఇంకేమయినా వుందా? వూరంతా గగ్గోలెత్తి పోదూ? జీవితమంతా మనల్ని వేలెత్తి చూపుతూనే వుంటారందరూ"

"మరేం చేద్దామంటావో చెప్పు"

"పెద్దవాళ్లు చెప్పినట్లే నడుచుకోవడం మంచిదనుకుంటున్నాను"

"మాధవీ!" దెబ్బ తిన్నట్లు అన్నాడు ఈశ్వర్.

"సరే మాధవి! నీ సహకారం లేక పోయింతర్వాత ఇంక నేను మాత్రంచేయగల్గిందేముంది? సరే! ఇప్పుడే వెళ్ళి మా వాళ్ళకి నా అంగీకారం తెలియ జేస్తాను"

"అయ్యో! అంత కోపమెందుకు? ఈ కోపంలో నన్నొక్కదాన్నే ఇక్కడ వదలి వెళ్లి పోయేట్లున్నావ్!" నవ్వుతూ అంది మాధవి.

"నీకు అంతా నవ్వులాటలాగానే ఉంటుందిలే!" కోపంగా అన్నాడతను.

చాలాసేపు మౌనంగా గడిచింది.

"మరింక వెళ్దామా?" లేచి నిలబడుతూ అంది మాధవి.

"పద" తప్పదన్నట్లు అన్నాడతను.

ఇద్దరూ ఆటోలో ఆమె ఇల్లు చేరుకున్నారు.

"గుడ్ నైట్" అంది మాధవి.

"గుడ్‌నైట్" బాధగా అన్నాడు ఈశ్వర్.

"ఇలా ఇదే ఆఖరిసారి కలుసుకోవడం కదూ?"

"అవును"

కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా గడిచిపోయినయ్.

"వెళ్తాను" ఆ ఆటోలోనే వెనుదిరిగాడు ఈశ్వర్. మాధవి చేయివూపింది.

ఇంటి దగ్గర నిరంజనం కొడుకుకోసం ఎదురుచూస్తున్నాడు.

"ఏం ఆలోచించావురా?" గడపలోనే నిలబెట్టాడు ఈశ్వర్ని.

"మీ ఇష్టమొచ్చినట్లు చెయ్యండి నాన్నా"

ఆయన గడగడా నవ్వాడు.

"నీకు నిజంగా బుద్ధి లేదురా, మాధవి లాంటి అందమైన, గుణవంతురాల్ని చేసుకోవడానిక్కూడా ఇంతగా ఆలోచించాలా?"

ఈశ్వర్ విసురుగా తన గదిలోకి వెళ్లి పోయాడు. తండ్రి మీద అతనికి విపరీతంగా కోపం పెరిగిపోయింది. మాధవి లాంటి పిల్లని చేసుకోవడానిక్కూడా ఆలోచించాలా అట! అసలెవడాలోచిస్తున్నాడూ? తామిద్దరికీ పెళ్లికి ముందు ప్రేమ కలాపాలు జరిపే థ్రిల్ కావాలనిగాని లేకపోతే వీళ్ళమాట ప్రకారం ఎప్పుడో పెళ్ళి చేసుకునే వారు!, మంచం మీద కూలబడి బూట్లు విప్పుకుంటూ తన్లో తానే గొణుక్కోసాగాడీశ్వర్. ★

(ఈ వారం వారపత్రిక 22-2-84)

# వయసు బొమ్మ

ఆఫీస్ నుంచి బయటికొచ్చాను.

అబిడ్స్ సెంటరు చాలా రద్దీగా వుంది. సీతాకోక చిలుకల్లా అలంకరించుకొని వ్యాహ్యాళికి, షాపింగ్‌కి, సరదాలకి బయల్దేరిన యువతుల్తో రంగు రంగులుగా ఆకర్షణీయమై వుందా ప్రాంతం.

అకస్మాత్తుగా నా కళ్ళు ఎదురుగా వస్తున్న యువతి మీద నిల్చిపోయినయి.

అందంగానే వుందామె. కానీ అందం కన్నా ఆకర్షణ అమితంగా వుంది. బొడ్డు కింద చీర, సగం బయటికి కనబడుతున్న వక్షోజాలు, చీరకు-జాకెట్టుకు మధ్య నగ్నంగా కనబడుతున్న శరీరం...... వేడెక్కిపోతోంది......!

అమాంతం ఆమెని కావలించుకుని.....

అక్కడే నిలబడిపోయి ఆమె నన్ను దాటిపోయే వరకు అలాగా చూస్తుండి పోయాను.

చీర ఇంకొంచెం కిందకు జారితే ఎంత బావుంటుంది..... అడ్డంగా వున్న ఆ బెత్తెడు చీర కూడా తొలగిపోతే ఎంత రంజాగా వుంటుంది:?------

ఆమె వేపే అలా చూట్టం అసహ్యం, అసభ్యత అని నాకూ తెలుసు-అయినా చూపులు పక్కకి మళ్ళించుకోలేక పోతున్నాను! నేనే కాదు అక్కడున్న చాలామంది అటువంటి పరిస్థితుల్లోనే కొట్టుమిట్టాడుతున్నారు!

ఆమె మాత్రం ఇవేమీ గమనిస్తున్నట్టు లేదు. ప్రజల్ని రెచ్చగొట్టడమే తన ధ్యేయం....అన్నట్లు వయ్యారంగా సోయగాలు ఒలకబోస్తూ నడుస్తోంది.

నాలో ఎంత అణగదొక్కాలని ప్రయత్నిస్తున్నా అదోవిధమైన ఆవేశం కట్టలు తెంచుకొని ముందుకురుకుతూ వుంది. ఆమెను చటుక్కున దగ్గరికి లాక్కోవాలని, ఏమేమో చేయాలని మనసు వువ్విళ్ళూరుతూనే వుంది. కానీ చుట్టూ జనం!

శరీరాన్నైతే బలవంతాన్నైనా అదుపులో పెట్టగలుగుతున్నాను గాని మనసుని పట్టుకోలేక పోతున్నాను.

'ఫాషన్లూ! జిందాబాద్! మీరు మరింత వేగంగా పురోగమించాలి అతి త్వరలోనే ఈ కొద్ది పాటి గుడ్డ కట్టుకోవడం కూడా సిగ్గు చేటనిపించేలా విజృంభించేసేయాలి. అప్పుడే నాలాంటి వాళ్ళకి మరింత కనువిందు!......'

ఆలోచిస్తూ నెమ్మదిగా బస్టాప్‌కి చేరుకోవడం, వెంటనే బస్సొచ్చేయడం జరిగింది. బస్సెక్కాను.

బస్సులోనే కాదు, బస్సు దిగింతర్వాతకూడా ఆమెవల్ల కల్గిన మత్తు పూర్తిగా తగ్గలేదు. మనసుని బలవంతాన నిగ్రహించుకొంటూ బయల్దేరాను.

మా ఇంటికెళ్ళే సందు తిరిగి రెండడుగులు వేసేనో లేదో ఠక్కున నిలబడిపోయాను!

రోడ్డుపక్కనే మురికిగుంట దగ్గర కూర్చునుందో అమ్మాయి. వయస్సు ఇరవై రెండేళ్ళకి మించి ఉండదు.

వయసుతోపాటు పెరిగిన అవయవాల్ని దాచుకోవాలనే ధ్యాస ఆమెకులేదు. వంటిమీదున్న ఆ కొద్దిపాటి చిరుగుల గుడ్డ ఆమె

నిండుయవ్వన శరీరాన్ని సరిగ్గా దాచలేక పోవడం చేత యవ్వనం తొంగి చూస్తోంది.

కానీ ఆమెకి ఆ ధ్యాసలేదు.....!

"బాబూ! ఒక్క పైసా ధర్మం చెయ్యండి!" అంటూ అతిదీనంగా వచ్చే పోయేవాళ్ళ నడుగుతోంది.

ఆమె బీదతనం. ఆకలి అరుపులు నన్ను కదిలించి వేసాయ్! ఆమెకి ఏదో ఒక సహాయం చేయాలన్న తపన, ఆమెని ఆ బాధల్నుండెవరైనా రక్షిస్తే బావుండునన్న జాలీ-నన్నావహించాయ్. ఆమె శరీరాన్ని పూర్తిగా దాచుకోవడాన్కి అవసరమైన వస్త్రాన్నన్నా లభించేట్లు చేయమని భగవంతుణ్ణి ప్రార్థించాను.

అబిడ్స్‌లో ఇందాక కనిపించిన ఆ ఫ్యాషన్ యువతి కళ్ళ ముందుమెదిలింది.

ఆమె, ఈ అడుక్కు తినే యువతీ- ఇద్దరూ యవ్వనంలో వున్నవాళ్ళే!దాదాపుగా వయస్సులు కూడా సమానమే!

మరి-

ఆమెను చూసి మనసలా ఎందుకు చలించింది? ఈమెవల్ల ఇలా ఎందుకు కరిగిపోతోంది?

వెంటనే స్ఫురించింది-

ఫ్యాషన్ కోసం చాలీచాలని వస్త్రాలు ధరించి అవయవ ప్రదర్శన చేస్తోందామె. ఈమె దారిద్ర్యం వల్ల స్తోమత లేక ఇలా అర్థ నగ్నంగా తిరుగుతోంది. అందుకే ఆమెను చూడగానే కడుపు నిండిన మరో ఆకలి. ఈమెను చూడగానే కడుపు తరుక్కు పోయి జాలీనూ!

అంతేకాకుండా మరో విషయం అప్పుడే తెలుసుకున్నాను. ఏ మనిషి మనసులో మంచి, చెడు ముద్రించుకు పోయివుండవు. పరిసరాల ప్రభావం వాళ్ళ మీదెంతో వుంటుంది;

"సంధ్యా......" గట్టిగా పిల్చాను ఇంట్లోకి అడుగుపెడ్తూనే.

"ఏంటండీ! వస్తూనే అలా కేకలువేస్తున్నారు!" శ్రీమతి ఆశ్చర్యంతో ఎదురొచ్చింది.

"నీ పాత చీర వుంటే ఒకటివ్వు....."

శ్రీమతి ఎగాదిగా నన్నోసారి చూస్తూ ఏం మాట్లాడకుండా లోపలికెళ్ళి ఓ పాత చీర తెచ్చిచ్చింది.

ఆ చీరని యాంత్రికంగా అందుకుని గబా ఆ అడుక్కునే యువతివైపు బయల్దేరాను. ★

(ఆంధ్రభూమి సచిత్రవారపత్రిక 20-4-1978)

# వయసుకి అటు ఇటు

డియర్ సుధాకర్-

నీకో శుభవార్త నామేరేజ్ ఫిక్స్ అయింది. వధువు నీకు తెల్సు. మీ క్లాస్‌మేట్ సునంద. వచ్చేనెల ఇరవైన పెళ్ళి. ఘుందే నీకు రాస్తున్నాను-మళ్ళీ శలవు దొరక లేదు లాంటి సాకులు చెప్పడానికి వీల్లేకుండా!సాధ్యమైనంత ముందే రా....రాజారావ్

ఉత్తరం చదవగానే కోపంతో వళ్ళు మండి పోయింది....!

రాజారావ్‌కి పెళ్ళి కుదరడం కాదు నాకు అంత కోపం కలిగించడానికి కారణం ..... పెళ్ళికూతురు సునంద కావడం !

'సునందా!నీకిక ఆనందమే లేకుండా చేస్తాను చూడు!!' కోపంగా నాలో నేనే గొణుక్కున్నాను.

నేను మనసారా ప్రేమించి పెళ్ళి చేసుకుంటానని అడిగినప్పుడు నిర్మొహమాటంగా 'నో' చెప్పినప్పుడే ఆమె మీదున్న సదభిప్రాయమంతా పోయింది. మనసంతా వ్యతిరేకతతో నిండి పోయింది.

రాజారావ్ బాంక్‌లో ఆఫీసర్‌గా పని చేస్తున్నాడు. ఒక్కడే కొడుకు... బాగా డబ్బున్న కుటుంబానికి చెందినవాడు..... అందుకే అతనితో సంబంధాన్ని కలుపుకోవడానికి అర్రులు చాస్తున్నారు.

నన్ను కాదని వాడి కోసం పరుగెడుతున్న సునందకి గుణపాఠం చెప్పితీరాలి. ధృఢ నిశ్చయాని కొచ్చాను.

ఎలా చేస్తే బావుంటుందా అని మనసు పరిపరివిధాల ఆలోచించ సాగింది.

రాజారావ్ వాళ్ళ వూరు పెద్దదూరమేమి కాదు. కాబట్టి పర్సనల్‌గా వెళ్ళి సునంద కారెక్టర్ మంచిది కాదని చెప్పి సంబంధాన్ని చెడగొట్టాలని నిర్ణయించుకున్నాను.

ఆ ఆలోచన రావడమే ఆలస్యం బయల్దేరాను.

***

రైలు రావడానికి పది నిముషాలు పైనే టైముంది.

రాజారావ్‌కి సునంద గురించి ఎలా చెబితే పూర్తిగా ఏహ్యా భావం కలుగుతుందా అని ఆలోచిస్తూ ప్లాట్ ఫారమ్ మీద అటు ఇటు తిరగసాగాను.



హఠాత్తుగా ప్లాట్ ఫారం మీద అడుగు పెట్టిన వాళ్ళని చూడగానే ఆశ్చర్యపోయాను.



రాణీ......!

ఆ పక్కనతను ఆమె భర్తే అయివుంటాడు!

వెంటనే రాణీమీద జాలేసింది.



నా భార్య కావాలని కలలుగన్న ఆమె చివరికి అతనికి చిక్కిందన్నమాట!అందమే కాదు ఎటువంటి ఆకర్షణా ఏ క్రేజానా లేదు అతన్లో. మరి ఏమి చూసి చేసుకుందో రాణీ !! జాలేసింది.

"హల్లో సుధాకర్ గారు..." నవ్వుతూ దగ్గర కొచ్చింది.

నేను పలకరింపుగా నవ్వాను.

"మీరూ సికింద్రాబాద్‌లోనే వుంటున్నారా?" అడిగిందామె.

"హైద్రాబాద్‌లో వుంటున్నాను. అర్జంటుగా వరంగల్ వెళ్ళాల్సి బయల్దేరాను.....మరి మీరో ?"

"మేము ఎక్కడికీ వెళ్ళడం లేదు. ఇప్పుడొచ్చే బండిలో చుట్టాలు వస్తున్నారు. వాళ్ళని ఇంటికి తీసుకువెళ్దామని. అన్నట్టు ఈయన్ని పరిచయం చేయలేదు మా శ్రీవారు. హెచెమ్టీలో పని చేస్తున్నారు. ఈయన సుధాకర్ ....?"

"బ్యాంక్‌లో క్లర్క్‌గా పనిచేస్తున్నాను" ఆమె మాటల్ని పూర్తి చేసాను.

గుడ్లప్పగించి చూడడం తప్ప అతనేమీ, మాట్లాడడం లేదు. ఇద్దరం కాలేజీ జీవితాన్ని అప్పటి స్నేహితుల్ని నెమరు వేసుకో సాగాం.

పది నిముషాలు పది సెకండ్లలా గడిచిపోయాయి. వాళ్ళెదురు చూస్తున్న బండికి గంట కొట్టారు.

రాణిలో అప్పటి చలాకీతనం ఏమాత్రం తగ్గలేదు. పైపెచ్చు అప్పుడు కనిపించని అందాలు ఆమెలో ఇప్పుడు కనిపించసాగాయి. తెలివి తక్కువగా రాణిని చెయ్యిజార్చుకున్నానేమోనని కూడా ఆలోచించసాగాను.

రాణి నాకు దక్కలేదన్న బాధకన్నా అతని పాలిట బడ్డదే అన్న బాధ ఎక్కువ అయింది. రాణి కన్నా అందగత్తె అని సునంద కోసం వువ్విళ్ళూరాను. ఆమె అంతకన్న అందం కోసం పాకులాడింది. కోరుకున్న అందం ఎవరకీ దొరకలేదు.

సునంద మీదున్న మోజుతో రాణిని కాదన్నాను. నా మీద కోపంతో ఆమె ఇతన్ని చేసుకోలేదు కదా!ఒక్క క్షణం అనుమానం వేసింది.

అయివుండదు. నా మీద కోపముంటే ఇంత బాగా మాట్లాడేదా!అసలు గుర్తు పట్టనట్లే నటించేది! నా అనుమానాన్ని నేనే నివృత్తి చేసుకున్నాను.

"ఏమిటండీ! మేమిలా మాట్లాడుకుంటుంటే మీరు ఒక్క మాట కూడా మాట్లాడరు...!" చిరు కోపాన్ని ప్రదర్శించింది రాణి.

" మాటల్ని వింటున్నా........" నవ్వాడతను.

ఆమె నవ్వింది.

నవ్వితే రాణి అందం విజృంభించింది. కానీ ఇతను నవ్వితే మరింత వికృతంగా అనిపిస్తున్నాడు!

భార్యా భర్తలలో ఎంత తేడా!

'ఐ పిటీ యు రాణీ.....! అందం లేదు........చొరవ లేదు......సరదాగా నాల్గు కబుర్లు చెప్పలేడు... అతనితో ఎలా కాపురం చేస్తున్నావో ..............!' రాణి మీద జాలితో మనసంతా నిండి పోయింది.

ఇంతలో పెద్ద శబ్దం చేస్తూ బండి ప్లాట్ ఫారమ్ మీదకి వచ్చేసింది. ప్లాట్ ఫారమ్ మీద కూడా సందడి పెరిగింది.

"అరుగో.. ఆ కంపార్ట్మెంట్లో వున్నారు... నేవెళ్ళి వాళ్ళను తీసుకొస్తాను. నువ్వు ఇక్కడే వుండి సుధాకర్ గారితో మాట్లాడుతుండు.." గబగబా ముందుకు కదిలాడు రాణి భర్త.

రాణిని ఓదార్చాలి ఎలా ...? అసలు ఎలా మొదలు పెడితే బావుంటుంది....

"వాళ్ళ మామకూతురు వస్తుంది... అదీ సంబరం..." ముందు రాణి మాట్లాడింది.

ఈ అందగాడికి మామ కూతురు కూడా వుందా? నవ్వొచ్చింది నాకు.

"చిన్నప్పుడే ఆ పిల్ల తల్లి తండ్రి పోయారు. వీళ్ళింట్లోనే పెరిగింది. మా మామగారు వాళ్ళకి ఆమెనే కోడలుగా చేసుకోవాలని ఎంతో వుండేదిట..."

మరి చేసుకోవలసింది.

మధ్య నీగొంతెందుకు కోసారు? ఆమె ధోరణిలో ఆమె చెప్పుకుపోతోంది. నాకు మాత్రం అతని మీద మొదటి నుంచీ సదభిప్రాయం కలగటం లేదు.

"ఆమె ఈయన్ని చేసుకోనని ఖండితంగా చెప్పేసిందట.... అంతే కాకుండా మరెవర్నో ప్రేమిస్తున్నట్లు కూడా చెప్పిందట..."

"ఆమె ధైర్యానికి అందరూ ఆశ్చర్యపోయారు.. మా మామగారు వాళ్లయితే ఆమెను తెగ తిట్టారట. ఆఖరికి ఈయనే దగ్గరుండి వాళ్ళిద్దరికీ పెళ్ళి జరిపించారు.... ఈ కాలంలో ఇంత మంచి మనసు ఎంత మందికుంటుంది చెప్పండి" రాణి మాటల్లో గర్వం కనిపించసాగింది.

ఇన్నాళ్ళూ తమింట్లో వుండి తన్ను చేసుకోనని ఖచ్చితంగా చెప్పిన ఆ పిల్ల పెళ్ళి కోరిన వాడితో జరిపించిన అతనికి, నన్ను కాదన్న పిల్ల భవిష్యత్తుని నాశనం చెయ్యాలని బయల్దేరిన నాకు ఎంత తేడా!

ఇంత వరకూ నేను చాలా గొప్పవాణ్ణని, అతను వట్టి వెధవని విర్రవీగాను. అందం లేకపోయినా అంతకన్నా గొప్ప మనసుంది అతనికి! బయటికి అందంగా కనిపించినా భయంకరమైన మనసు నాది!

నాలాంటి వాడి సొత్తు కాకుండా అంత మంచి భర్తని దక్కించుకున్న రాణి చాలా అదృష్టవంతురాలు!

నా ఆలోచనల్లో రాణి భర్త వాళ్ళు అక్కడికి వచ్చింది కూడా గమనించలేదు. ' మీ వూరు నుంచీ రాగానే తప్పకుండా మా ఇంటికి రావాలి..." మరీ మరీ చెప్పాడతను. అతనంత అభిమానం చూపిస్తున్న కొద్దీ నాకు సిగ్గు వేయసాగింది.

"అలాగే..." అని నా దగ్గర మాట తీసుకున్న తర్వాతే వచ్చిన అతిథులతో అతను ముందుకి అడుగు వేశాడు.

అతను వెళ్తున్న దిక్కే చూస్తూ అలా ఎంత సేపు నిలబడ్డానో నాకే తెలియదు. ఎనౌన్సర్ మాటల్తో ఈ లోకంలోకి వచ్చాను.

"విజయవాడ వెళ్ళే ఎక్స్‌ప్రెస్ రెండో నెంబరు ప్లాట్ ఫారమ్ మీదకి కొన్ని క్షణాల్లో వచ్చును.."

రకరకాల ఆలోచనలు ఒక్క సారిగా నా మెదడుని వూపేసాయి.

చటుక్కున తేరుకుని స్టేషన్ బయటికి బయల్దేరాను.

వరంగల్ ప్రయాణాన్ని వాయిదా వేసుకున్నాను. రాజారావ్ రాసినట్టు పెళ్ళికి ముందుగానే వెళ్ళేది, ఇప్పుడు కాదు!

రాణి భర్త నా కళ్ళు తెరిపించాడు.

లేకపోతే ఓ పిల్ల జీవితాన్ని నాశనం చేసేవాణ్ణి! మనిషికి కావలసింది శారీరక అందం కాదు

మానసిక అందం!

థాంక్యూ జంటిల్ మన్ థాంక్యూ. మనసులోనే అతనికి కృతజ్ఞతలు చెప్పుకుని రూమ్ వేపు బయల్దేరాను. *

(ఆంధ్రభూమి మాసపత్రిక సెప్టెంబర్ 1984)

# ఇరుకు వయసు

గౌర్డు విజిల్ వూదాడు.

"ఇలా దగ్గరకు రండి" కిటికీ దగ్గరికి జరుగుతూ పిలిచింది రమ. దగ్గరకు వెళ్ళాను.

"ఎలాగూ నేను లేనుగదాని మీరు రోజూ సీతాఫల్ మండీ వెళ్ళి మీ ప్రకాశరావు, ధనకోటి, నాగభూషణం, సత్యన్నారాయణల్తో కల్సి అర్ధరాత్రి వరకూ పేకాడుతూ కూర్చోండి" ప్రేమగా అంది.

"ఛ.....ఛ......... రోజూ పేకాటెందుకాడ్తాను?"

"కాఫీల్తో కాలక్షేపం చేస్తూ భోజనం చేయడం మానేయండి"

".... .... "

"నే నొచ్చేసరికి మీ ఆరోగ్యం పూర్తిగా పాడు చేసుకోండి."

"ఏమిటీ! మాట పలుకూ లేకుండా అలా బెల్లం కొట్టిన రాయిలాగా నిలబడి పోయారు! నేను మాట్లాడుతున్నది మీతోనే!"

"నేనేం మాట్లాడేది? నేను మళ్ళీ నోరు మెదపకుండా అన్ని విషయాలూ నువ్వే మాట్లాడేస్తుంటేను."

"ఛ.......ఛ... మీరు నోరు మెదపకుండా మిమ్మల్నే మంటున్నానండి. అనవసరంగా కాఫీల్తాగుతూ,భోజనం చేయకుండాను, నిద్దర లేకుండా పేకాటాడి ఆరోగ్యం పాడు చేసుకోవద్దంటున్నానంతే!"

"చూడు రమా! మన పెళ్ళై సంవత్సరం కావస్తోంది అంతే! అంతకుముందు నువ్విలా చెప్పలేదని నా ఆరోగ్యం కాస్తా పాడు చేసుక్కూర్చున్నానా నీ పిచ్చిగాని."

"ఏదో నా పిచ్చినాడి."

"అద్సరేగాని ఇది నా అజ్ఞనుకో, లేకపోతే అభ్యర్థననుకో లేకపోతే మరేమైనా అనుకో - నువ్వు మాత్రం పాటించాలి."

"ఏంటి?"

"నువ్వు మీ వూరెళ్ళింతర్వాత ఆ బాబూరావ్ - మీ ఫామిలీ ఫ్రెండ్ రోజూ మీ ఇంటికొచ్చి హస్కుకొట్టి పోతూంటాడు చూడు! అతన్తో నీవు మాట్లాడ్డం నాకిష్టం లేదు"

"..... ...... ......."

"మాట్లాడవేం?"

"నేను మాట్లాడవద్దని చెప్తున్నది- నాతో కాదు, అతన్తో."

"అలాగే"

"విశేషాలు లేకపోయినా రోజు విడిచి రోజూ వుత్తరం రాస్తూండు." రమ చేతినందుకొని నొక్కుతూ అన్నాను.

రైలుకదిలింది.

"మీ ఆరోగ్యం జాగ్రత్త! పదిహేను రోజుల్లో తిరిగొచ్చేస్తాను..."

బండి స్పీడందుకుంది.

రమ కన్పించేంతవరకూ చెయ్యూపుతూ అలాగే నిల్చుండిపోయాను.

మా పెళ్ళయి సంవత్సరం కావస్తోంది. ఈ సంవత్సర కాలంలో ఒకళ్ళని విడిచి మరొకళ్ళం ఇంతవరకూ ఒక్కరోజు కూడా గడపలేదు. రమని నా భార్యగా పొందడం నిజంగా నా అదృష్టం. గుణం విషయంలో ఏమిటి, అందం విషయంలో ఏమిటి- ఏ విషయంలో చూసినా ఆమె నాకన్నా మిన్నేనేమోననిపిస్తోంది!

దాదాపు పదిహేను రోజులవరకూ మళ్ళీ ఆమెని చూట్టానికి పడదు. ఆఫీసుకి శెలవు పెట్టడాన్కి వీలవలేదుగాని లేకపోతే నేనూ ఆమెతోనే బయల్దేరేవాడ్ని

మనసంతా అదోలా వుంది.

నెమ్మదిగా బయల్దేరాను.

"రాజా!......" ఎవరిదో పరిచయమ్మైన గొంతు వినబడ్డంతో వెనక్కి తిరిగాను.

రూప!

ఆశ్చర్యపోయాను.

ఆమె గబగబా నా వేపే వస్తోంది!

దాదాపు మూడు సంవత్సరాలవుతోంది. ఆమెను జూసి. తిరిగి ఈ వేళ హఠాత్తుగా అక్కడ చూట్టం నాకు ఆశ్చర్యంతో పాటు ఆనందాన్ని కూడా కలిగించింది. ఇప్పటికీ ఆమెలో ఏమంత మార్పు లేదు. కొంచెం లావయింది. అంతే!

"ఏమిటీ ! అలా చూస్తున్నావ్! నన్ను గుర్తు పట్టలేదా?" నవ్వుతూ అడిగింది. రూప సర్దుకుని చూపుల్ని ఆమె ముఖమ్మీంచీ పక్కకి మరల్చాను.

అదే నవ్వు! కోర్కెల్ని రేకెత్తించే నవ్వు! అప్పటికి ఇప్పటికీ ఆ నవ్వులో కూడా ఏ మాత్రం మార్పులేదు!

"అబ్బే! దాదాపు మూడు సంవత్సరాల తర్వాత అనుకోకుండా ఇక్కడ కన్పించేసరికి.." తడబడ్తూ అన్నాను.

"నీకే కాదు అనుకోకుండా నిన్ను చూసే సరికి నాకూ ఆశ్చర్యం వేసింది" ఆమె మాటల ధోరణి కూడా మారలేదు. ఆమెలో వున్న ఆ కలుపుగోలుతనమే ఆమెలో వున్న ప్రత్యేక ఆకర్షణ!

ఆమె పక్కనే నిలబడున్న యువకుడి వంక జూశాను!

కొంపదీసి అతను ఆమె భర్త కాడు కదా!

నాకా ఆలోచన వచ్చేసరికి వళ్ళు జలదరించింది.

'అలా కావడాన్కి ఎంత మాత్రమూ వీల్లేదు' నా మనసు ఘోషించ సాగింది.

ఒకసారి చూడగానే మళ్ళీ మళ్ళీ చూడాలన్పించే అందం ఆమెది. ఆమెకి ఏమాత్రం సరితూగని మనిషతను!

'నో' వాళ్ళిద్దరూ భార్యాభర్తలు కావడాన్కి వీల్లేదు. ఆమె అతన్ని భర్తగా కాక ఏ కజిన్ గానో పరిచయం చేస్తే బాగుండు" మనసు చిందరవందరగా తయారైంది.

"ఏమండీ మీకెప్పుడూ చెప్తూండేదాన్ని చూడండి! రాజు అనే అతను మా కాలేజీలో మిమిక్రీ చేస్తుండేవాడని! ఇదిగో ఈయనే ఆ మహానుభావుడు!" నవ్వుతూ అంది రూప.

"రాజూ ఈయనే మా శ్రీవారు"

"నమస్తే!" అన్నాడతను నా వంక జూసి నవ్వుతూ.

ప్రతి నమస్కారం జేశాను. అనుకున్నంతా అయింది. దేవుడు చేసే పనులన్నీ అవకతవకలేననడాన్కి వాళ్ళే నిదర్శనం.

"రూప రోజుకోసారైనా మీరు జేసిన మిమిక్రీలు చెప్పి నవ్వుకోందే వుండలేదండి. నిజానికి నాకూ చాలా సరదాగా వుండేది వింటుంటే!" అన్నాడతను.

నవ్వి వూరుకున్నాను.

"పదండి! అందరం కల్సి కాఫీ తాగుదాం!" స్టేషన్ కెదురుగా నున్న హోటల్లోకి దారి తీశాడతను.

ముగ్గురం ఓ టేబుల్ ముందు కూర్చున్నాం.

"ఊ!.... ముందు నీ విషయాలు చెప్పు! ఎక్కడున్నావ్? ఏంజేస్తున్నావ్? పెళ్ళైందా?" నవ్వుతూ అడిగింది రూప.

ఆ నవ్వు వుక్కిరి బిక్కిరి చేస్తోంది నన్ను.

"ఇక్కడే......బాంక్‌లో ఆఫీసరుగా వుద్యోగం. పెళ్ళై దాదాపు సంవత్సరం కావస్తోంది. ప్రస్తుతం మా ఆవిడ పుట్టింటికి వెళ్ళింది. ఇవి నా గురించి విశేషాలు. మరి, మీ సంగతులేమిటి?"

"మా పెళ్ళై కూడా సంవత్సరం కావస్తోంది" అంది రూప నవ్వుతూ.

"సెక్రటేరియట్ లో క్లర్క్‌గా చేస్తున్నాను" అన్నాడతను.

"మీ ఇల్లెక్కడ?" అడిగాను.

అడ్రస్సు, గుర్తులు చెప్పింది రూప.

ముగ్గురం కాఫీల్తాగాం.

రూప మాట్లాడే ప్రతి మాటలోనూ తెలుస్తూనే వుంది ఆమెకి నామీదున్న అభిమానం ఏమాత్రం తగ్గలేదని!

మరో కొద్ది సేపు అవి, ఇవి మాట్లాడుకున్న తర్వాత హోటల్లోంచి బయటికొచ్చాం. తప్పకుండా తీరిక జేసుకుని తమ ఇంటికి రమ్మని ఇద్దరూ మరీ మరీ చెప్పి సెలవు తీసుకున్నారు.

ఆటోలో ఇంటికి చేరుకున్నాను.

రూప ఇంకా నా మనస్సులో మెదుల్తూనే వుంది కవ్వించే ఆమె నవ్వుని మర్చి పోవడం నాకసాధ్యమే అవుతోంది. ఒకప్పుడు కాలేజీలోకెల్లా అందమైన అమ్మాయి మరీనాడు అందం చందంలేని ఓ గుమాస్తాని పెళ్ళాడి అనామకురాలిగా జీవితం గడుపుతోంది. నాకు రూపమీద విపరీతమైన జాలి కలిగింది. నాలాంటి వాడి పక్కన దర్జాగా ఖరీదైన జీవితాన్ని గడపాల్సిన రూప, ఇలా ఏమాత్రం గ్లామర్ లేని ఇరుకు జీవితాన్ని గడుపుతోంది.

శనివారం మధ్యాహ్నం రూపింటికి వెళ్ళాలని నిశ్చయించుకున్నాను.

శనివారం వరకూ రూపని చూడకుండా వుండటం నా వల్ల కాలేదు. కోరికల్ని రెచ్చగొట్టే ఆమె నవ్వు నాలో అశాంతిని రేకెత్తించింది! రెండవరోజు సాయంత్రం బాంక్‌నించి సరాసరి స్కూటర్ మీద రూప ఇంటికి బయల్దేరాను.

తేలిగ్గానే దొరికింది ఇల్లు!

రూప చేటలో బియ్యం పోసుకుని ఏరుతోంది. నన్ను చూడగానే సంబరంతో లేచి నిలబడి "అరె! ఇంత త్వరగా దయ కల్గిందే మామీద!" అంటూ లోనికాహ్వానించింది.

లోపలికి నడిచి తలుపు పక్కనే వున్న కుర్చీల్లో కూలబడ్డాను.

అది, ఒక్కటే గది! చాలా ఇరుకుగా వుంది! ఆ గదిలోనే ఓ మూల స్టవ్, మరో మూల గిన్నెలు, ఏవేవో చిన్న డబ్బాలు, కిటికీ పక్కనే మంచం, ఓచిన్ని టేబుల్, చేయెత్తితే తగిలే సీలింగూ-దారుణంగా వుంది వాళ్ళిల్లు!

'ఇలాంటి ఇళ్ళు కూడా వుంటాయా!' ఆశ్చర్యం వేసింది.

"ఏమిటీ! ఇంత ఇరుకులో ఎలా వుంటున్నారా అని ఆశ్చర్యపోతున్నావా? మా ఆయన నీలా పెద్ద ఆఫీసరేం కాదుకదా! మామూలు గుమాస్తా! మరి గుమాస్తా లిళ్ళు ఇలాగే వుంటాయ్" అంది రూప నావంకే జూస్తూ.

రూప పరిస్థితి చూసి గుండె తరుక్కు పోతోంది.

"మా ఇంట్లో మొత్తం అయిదు గదులున్నాయ్. మా ఇద్దరికీ మూడు గదులు చాలు. మిగతా రెండు గదుల్లో మీరుండకూడదూ?" అడిగాను.

"బాగుంది!ఇప్పుడీ ఇంటికేం? మాకు నిక్షేపంగా సరిపోతుంది. కాకపోతే నీలాంటి గెస్ట్‌లొస్తేనే వాళ్ళకిబ్బంది అయినా మా ఇంటికొచ్చే గెస్ట్‌ల సంఖ్య చాలా తక్కువలే" అంది జవాబుగా.

"సారీ రూపా! అయామ్ వెరీసారీ! నీ జీవితం నాకు బాధని కల్గిస్తోంది"బాధగా అన్నాను.

"బాగుంది! ఇప్పుడు నాకేమైందని నువ్వు బాధపడటం?" తలొంచుకుంటూ అంది రూప.

అవును! తన పరిస్థితి ఏమని చెప్పుకోగల్దు? ఆమె భుజమ్మీద చిరిగిపోయిన చీరని చిరుగు కనబడకుండా సర్దుకుంది రూప.

తెలుస్తూనే ఉంది! రూప జీవితం ఇరుకున పడిపోయింది! ఇంక బయట పడటం కల్ల! అంతా ఇరుకే!

"రూపా"పిల్చాను.

"ఏమిటి?" తలెత్తి చూసిందామె.

"నిజం చెప్పు! నువ్విక్కడ ఆనందంగా వున్నావా?"

"మన చేతుల్లో ఏముంది రాజా! రాతెలా వుంటే అలానే జరుగుతుంది. అయినా ఆనందానికి హద్దేముంది చెప్పు!"

నాకు మనసు చివుక్కుమంది.

రూప మనసు అద్దంలా కనబడుతోంది. పాపం! ఈ దిక్కుమాలిన ఇరుకుని భరించలేక ఆమె మనసు తల్లడిల్లి పోతోంది. గత్యంతరం లేక రాజీ పడ్తోంది.

రూపేకాదు! ఈ పరిస్థితుల్లో ఎవరైనా అంతే! అంతకన్నా ఇంకేం చేయగల్గుతారు?

ఉక్కపోస్తోందాగది! రుమాల్తో విసురుకో సాగాను.

"గది ఇరుకు కదూ! అందుకని బాగా వుక్కపోస్తోంది!" అంది రూప నెమ్మదిగా.

'ఇరుకుగా వుంది గదే కాదు రూపా- నీ జీవితం కూడా' లోలోపలే అనుకున్నాను.

"ఏమిటీ! అలా చూస్తున్నావ్!" అంది నవ్వేస్తూ

ఆమె నవ్వుతుంటే ఆమె అందం మరింత విజృంభించింది.

ఇంకా ఆ నవ్వుని వుపేక్షించడం నా వల్ల కాని పని.

లేచి రూప దగ్గరికి వెళ్లాను. నా చేతులామెను చుట్టేశాయి.

"రూపా! ఈ ఇరుకులోంచి బయటికిరా. ఆలస్యం చేయకు" అన్నానామెని గాఢంగా గుండెలకి హత్తుకుంటూ.

రూప తెల్లబోయింది.

మరు క్షణంలో ఆమె కళ్ళలో వ్యతిరేక భావం!

"ఛీ....నన్ను వదులు" గింజుకుంటూ అంది.

నేనదేమి విన్పించుకునే స్థితిలో లేను. నా పెదాల్తో ఆమె పెదాల్ని కలపబోయాను.

"వెంటనే వదుల్తావా? లేకపోతే గట్టిగా కేకలేయమంటావా?" కోపంతో వణికిపోతూ అంది.

చటుక్కున ఆమెని వదిలేశాను.

దూరంగా జరిగి నిలబడింది రూప.

"ఇడియట్! నా జీవితం ఇరుకైతే అయుండవచ్చేమోకాని బుద్ధులు మాత్రం కాదు. ఏదో స్నేహితుడివని కాస్త సర్దాగా పలకరించినంత మాత్రాన ఇలాగేనా ప్రవర్తించేది? నీలాంటి వాళ్ళకి ఇలాంటి వికృత భావాలుంటాయి కాబట్టే భార్య గాని, చెల్లెలు గాని ఎవర్తోనైనా కాస్త స్నేహభావంగా మాట్లాడితే చాలు అనుమానంతో వాళ్ళ ప్రాణాలు తీస్తారు. నాతో ఎప్పుడూ మళ్ళీ మాట్లాడ్డానికి ప్రయత్నించకు వెళ్ళు! గెటౌట్!" గట్టిగా అరిచింది.

నేను మరొక్కక్షణం కూడా అక్కడ నిలబడలేక వెంటనే బయటికి నడిచాను. *

(ఆంధ్రసచిత్ర వారపత్రిక 22-4-77)

# వయసు కౌగిలి

కొలాన్నీ దూరాన్నీ మింగుతూ ముందుకు దూసుకుపోతోంది రైలు. దాంట్లో ప్రయాణం చేస్తున్న ప్రవీణ్ మనసు అంతకు కొన్ని రెట్లు వేగంతో గతంలోకి దూసుపోయి విహరించసాగింది.

సరిగ్గా ఆరు నెలల క్రితం ఇదే రైలులో ప్రయాణం చేసి అన్నయ్యా వాళ్ళింటికి తిలారు వెళ్ళాడు. ఆ వూరు వెళ్ళడం అదే మొదటిసారి. అన్నయ్య స్టేషన్ మాస్టర్ కావడంతో బండి దిగేసరికి ప్లాట్ ఫారమ్ మీదే ఎదురొచ్చాడు.

తను డ్యూటీలో వుండడంతో ఓ పోర్టర్నిచ్చి ఇంటికి పంపాడు. నిరుద్యోగపర్వంతో బరువుగా వెళ్ళదీస్తున్న రోజులవి! కేవలం మెంటల్ రిలీఫ్ కోసమే అక్కడికి వెళ్ళాడు తను.

వదినకి తనంటే ఎంతో అభిమానం. హఠాత్తుగా దిగిన తనని చూడగానే నానా హడావిడి చేసింది. సుష్టుగా భోజనం పెట్టింది. బాగా తినడంవల్ల, ప్రయాణ బడలికవల్ల భోంచేయగానే మంచి నిద్ర పట్టింది.

"అక్కయ్యా......అక్కయ్యా...." అరుపులతో మళ్ళీ హఠాత్తుగా మెళకువ వచ్చింది.

లోపలికి చెంగున లేడిలా దూసుకొస్తున్న లేడీకాస్తా తన్ను చూడగానే ఠక్కున ఆగిపోయింది. ఆమెని చూడగానే తన బద్ధకం పూర్తిగా వదిలిపోయింది. చటుక్కున లేచి కూర్చున్నాడు.

"వదిన వంటింట్లో వున్నట్లుంది లోపలికి వెళ్ళండ"ని వెనక్కి తిరిగి వెళ్ళిపోబోతున్న ఆ మెరుపు తీగని వుద్దేశించి అన్నాడు తను.

"మళ్ళీ వస్తాలెండి....." మెరుపు తీగ మెరిసినట్లే మెరిసి మాయమైపోయింది.

"లేచావా.....నీకోసమేచూస్తున్నాను...."

రెండు ప్లేట్లలో కారబ్బూంది, లడ్డు పెట్టుకుని వదిన వచ్చింది.

"అబ్బ.....టిఫినా....."నసిగాడు తను.

నువ్వెంత సేపు పడుకున్నాననుకుంటున్నావ్! రెండు గంటలు దాటింది. తిన్న అన్నం అరిగిపోయే వుంటుంది. మొహం కడుక్కురా, టిఫిన్ చేద్దువుగాని" పక్కనే టీపాయ్‌ని మధ్యలోకి లాగి టిఫిన్ ప్లేట్లని దానిమీద పెట్టింది వదిన. "ఇంతకు ముందే ఎవరో అమ్మాయి వచ్చింది వదినా -'అక్కా' అనుకుంటూ నన్నుచూడగానే జడుసుకుని పారిపోయింది....." చిన్నగా నవ్వాడు తను "ఓహో కన్య వచ్చిందా? మరేం ఫర్లేదుగానీ నువ్వుముందు మొహం కడుక్కుని రా"

మొదటి చూపులోనే అంతగా తనని ఆకట్టుకున్న ఆ పిల్ల వివరాల్ని సేకరించడమెలా అని ఆలోచించుకుంటూనే మొహం కడుక్కు వచ్చాడు. టిఫిన్ తింటూ నెమ్మదిగా వదిన దగ్గర విషయాన్ని కదిలించాడు.

"పక్కంటి వాళ్ళ అమ్మాయిలే. టెన్త్ పోవడంతో చదువాపేసింది. అప్పుడప్పుడూ పుస్తకాలకోసం కబుర్లకోసం వచ్చిపోతుంటుంది. వాగుడు కాయ" వదిన అంది.

"మరి నేను లోపలికి వెళ్ళమని చెబుతున్నా అలా పారిపోయిందే!" అమాయకంగా అడిగాడుతను.

"ఎంత వాగుడుకాయ అయితే మాత్రం పరాయి మగాణ్ని చూస్తే సిగ్గుపడదా ఏమిటి?"ఫక్కున నవ్వింది వదిన.

తను ఆమెకి పరాయి మగాడా! భరించ లేక పోయాడామాటవిని. సాధ్యమైనంత త్వరలోనే ఆమెకి దగ్గర కావాలని అప్పుడే నిర్ణయించుకున్నాడు.

అందుకే కాసేపుండి మళ్ళీ వచ్చిన ఆమెతో వదినతో పాటు తనూ కబుర్లలో దిగాడు. అరగంటలో ఎంతో చనువుగా మాట్లాడడం మొదలు పెట్టింది ఆమె.

నవ్వుతుంటే ఆమె అందం మరింత విజృంభించేది. అలా చూస్తున్నప్పుడల్లా ఆ అందాన్నంతటినీ సొంతం చేసుకోవాలనే తపన తనలో పెరిగిపోతుండేది.

ఆ రాజా తనకి బాగా గుర్తు. ఇప్పుడేకాదు. ఎప్పుడూ మరచి పోలేదు.

అన్నయ్యా డ్యూటిలో వుంటే కలుసుకుందామని స్టేషన్‌కి బయల్దేరాడు తను. గేటు దగ్గర ఎదురొచ్చింది కన్య!

ఆమెని పలకరిస్తూ పక్కనున్నగులాబీ పువ్వుని కోసాడు తను.

"అరె.....పువ్వుని కోసేసారా? తనకి పువ్వులంటే ఎంత ఇష్టమయినా గులాబీ పూలని చెట్లనించి కొయ్యొదు అక్కయ్య. మన తలలో కన్నా ఆ చెట్ల కుంటేనే అవి అందంగా వుంటాయి అంటుంది" అంది చిన్నగా నవ్వుతూ కన్య.

నవ్వితే ఆమె బుగ్గలు సొట్టలుపడతాయి. కళ్ళు చిన్నవై కన్పిస్తాయి. ముక్కు పుటాలు కదులుతూమురిపిస్తుంది. విజృంభించిన అందాన్ని చూస్తూ భరించలేక పోయాడు తను. చేతిలో వున్నాగులాబీ పువ్వునలిగిపోయింది.

"అదేమిటి ఆ పువ్వుని అలా నలిపి పారేస్తున్నారు!" మరింత చిలిపిగా మళ్ళీ నవ్వింది.

లాభం లేదు - తను మరికొంత సేపు అక్కడ నిలబడితే ఆమెనేం చేస్తాడో తనకే తలీదు. చేతిలో నలిగిపోయిన పువ్వుని కింద పారేసి "మళ్ళీ వస్తా అన్నయ్యా దగ్గరికి వెళ్ళి"అని ముందుకు సాగిపోయాడు తను.

స్టేషన్‌కి వెళ్ళాడన్న మాటే గాని అన్నయ్య దగ్గర కూర్చోలేకపోయాడు. కాసేపుకూర్చున్నాననిపించి తిరిగి ఇంటికి బయల్దేరాడు.

మళ్ళీ సరిగ్గా గేటు దగ్గరే కన్య ఎదురొచ్చింది. పలకరింపుగా చిన్న నవ్వు నవ్వి వాళ్ళింటివేపు కదిలింది.

వెనక నుంచీ కనిపిస్తున్న ఆమె జడలో వున్న గులాబీని చూసి ఉలిక్కిపడ్డాడు. తను ఇందాక నలిపి కింద పారేసిన పువ్వు అది.

తను నలిపి కింద పారేసిన పువ్వుని కన్య భద్రంగా తన తల్లో పెట్టుకుంది. అంటే ఆమె తనని ప్రేమిస్తోందన్న మాట! వుబ్బి తబ్బిబ్బయి పోయాడు తను ఏదో ఒక పనిమీద కన్య వదిన దగ్గరికి రోజాకి అయిదారు సార్లయినా వచ్చేది. వచ్చినప్పుడల్లా వదినతో కన్నా తనతోనే ఎక్కువగా మాట్లాడేది. నాలుగు రోజుల్లో తామిద్దరి మధ్యా ఎంతో అనుబంధం పెనవేసుకుపోయింది.

"బాబూ!కొద్దిగా పక్కకు జరుగుతావా" ఎవరో అడగడంతో ఆలోచనల్లోంచి బయటపడి విసుగ్గా అటుచూశాడు ప్రవీణ్.

కొద్దిగా పక్కకి జరుగుతే కూర్చుంటానన్నట్లు ఓ పాసింజరు నిలబడున్నాడు. ప్రవీణ్‌కి చిరాకేసింది. అయిష్టంగానే కొద్దిగా పక్కకి జరిగి అతను కూర్చోడానికి చోటిచ్చాడు.

అతనివంకే చూస్తే ఎక్కడ కబుర్లు మొదలుపెడతాడోననే భయంతో కళ్ళు మూసుకుని మళ్ళీ గతంలోకి జారిపోయాడు.

ఆ రోజు తను మార్నింగ్ షో సినిమాకి వెళ్ళి వచ్చాడు. జోరున వాన కురుస్తోంది, ఇంటికి తాళం వేసుంది.

అన్నయ్య డ్యూటీకి వెళ్ళుంటాడు. 'వదిన ఎక్కడికి వెళ్ళిందబ్బా!?' ఆలోచిస్తూ వాకిట్లో నిలబడ్డాడు తను వర్షంలో తడుస్తూనే.

"ఏమండీ...." కేక వినిపించి కన్య వాళ్ళింటివేపు చూసాడు.

వాళ్ల గుమ్మంలో నిలబడి రమ్మన్నట్లు చేతితోనే సైగ చేసింది కన్య.

గబ గబా అటు వెళ్ళాడు తను.

"రండి....తమ్ముడుకి బావుండకపోతే అమ్మ, అక్కయ్య కలసి హాస్పిటల్‌కి వెళ్ళారు. మీరు వస్తే ఇమ్మని తాళంచెవి ఇచ్చారు" తాళం చెవిని అందిస్తూ చెప్పింది కన్య.

వర్షంలో పూర్తిగా తడిసిపోయాడు తను. తన చేతికి ఆమె చెయ్యి తగలగానే నరాలు జివ్వున లాగాయి.

"అరె వణికిపోతున్నారు... తుడుచుకోడానికి తుండు ఇస్తాను ఆగండి" నవ్వింది ఆమె.

నవ్వుతుంటే ఆమె అందం మళ్ళీ విజృంభించింది. తనలో వేడి ఒక్కసారి వెల్లువలా ప్రవహించినట్లనిపించింది. అలాగే ఆమె చేతిని పట్టుకుని సుతిమెత్తగా నొక్కాడు.

సిగ్గుతో నవ్వింది ఆమె. గర్వంతో తన ఛాతి పొంగి పోయింది.

"అమ్మా వాళ్ళు ఇప్పుడే వెళ్ళారు. వాళ్ళు రావడానికి టైము పట్టొచ్చు." మునిపంట కింది పెదవిని నొక్కుతూ క్రీగంట తనని చూస్తూ అంది.

తనకి పూర్తిగా అర్థమైపోయింది! ఆమె అంటే తనెంత ఇష్టపడుతున్నాడో తనంటే ఆమె అంతే ఇష్టపడుతోంది. ఇప్పుడు తనేమి చేసినా అభ్యంతరం పెట్టదు. చొరవ తీసుకోవడమే చాలు! బయట వర్షం, ఎదురుగా ఇష్టపడ్డ వంటరి కన్య!

రెండడుగులు ముందుకు వేసాడు తను. ఆమె ఒక్క అడుగు కూడా వెనక్కి వెయ్యలేదు.

ఇద్దరి మధ్యా దూరం లేదు.

"అటు చూడండి....."తలుపువేపు చూపిస్తూ నవ్విందామె.

తలుపు వేసేయమంటోంది! గ్రీన్ సిగ్నల్!

చటుక్కున వెనక్కి తిరిగాడు తను. అక్కడనుంచి చూస్తోంటే అన్నయ్యా వాళ్ళ ఇల్లు స్పష్టంగా కనిపిస్తోంది.

ఆ ఇంటిని చూడగానే వదిన గుర్తొచ్చింది. అన్నయ్య కంటిముందు మెదిలాడు.

ఆ రోజా ఉదయమే తనకి ఉద్యోగం వచ్చినట్లు నాన్నగారిచ్చిన టెలిగ్రామ్ అందింది. ఇవాళో, రేపో తను వెళ్ళిపోతాడు. వెళ్ళిపోయిన తర్వాత ఈ విషయం పొరబాటున బయటికి పొక్కితే? అభిమానంగా చూసే అన్నయ్య వదినల మొహం తను చూడ గలడా మళ్ళీ? అందరూ వాళ్ళని నానా మాటలు అంటారు.

ఊహూ..... తనవల్ల వాళ్ళకాపరిస్థితి రానీయడు. చటుక్కున వెనక్కి తిరిగాడు తను.

ఎదురుగా కన్య!

ఆమె కళ్ళలో కోరిక!

ఒక్క క్షణం తనలోనూ మార్పు వచ్చింది. అయినా బలవంతాన తమాయించుకున్నాడు.

ఈ ఒక్క క్షణం తాము తొందరపడ్డారంటే మరెన్నో క్షణాలు బాధపడాల్సి వస్తుంది. ఈ పరిస్థితుల్లో కూడా అవకాశం జారవిడిచిన తన మంచితనాన్ని కన్య జీవితాంతం గుర్తుంచుకుంటుంది. అంతే! అక్కణ్ణించి గబగబా ఇవతలికి వచ్చేసాడు. ఆ రోజల్లా కన్య కనిపించలేదు. మర్నాడు ఊరెళ్ళేప్పుడు కూడా ఆమె కోసం వెదికాడు తను. కనిపించలేదు. తనకి చెప్పమని వదినకి చెప్పివచ్చేసాడు.

ఇన్ని రోజుల నుంచీ శారీరకంగా తను కన్యకి దూరంగా వున్నాడు గానీ మానసికంగా ఆమె కెప్పుడూ దూరం కాలేదు. అందుకే ఉద్యోగం పర్మినెంట్ అయినట్లు ఆర్డరు రాగానే పెళ్ళి ప్రసక్తి తీసుకురావాలని నిశ్చయించుకున్నాడు. పెద్దలద్వారా ఆ విషయాల్ని కదిలించే ముందు మరోసారి కన్యని కలిసి ఆమెతో మాట్లాడాలనిపించింది. అందుకే బలవంతాన రెండ్రోజులు శలవుతీసుకుని బయల్దేరాడు.

గట్టి కుదుపుతో రైలాగింది.

తిలారు!

బ్రీఫ్ కేస్ నందుకొని కిందకు దిగాడు ప్రవీణ్. అన్నయ్య ప్లాట్‌ఫారమ్ మీద కనిపిస్తాడని చూసాడు. డ్యూటీలో లేనట్లున్నాడు. ఇంటివేపు బయల్దేరాడు.

హటాత్తుగా దిగిన అతన్ని చూస్తూనే ముందు వాళ్ళిద్దరూ ఆశ్చర్య పడ్డా తర్వాత ఆనందపడ్డారు. కుశల ప్రశ్నలయ్యాయి. ప్రవీణ్ కళ్ళు మాత్రం కన్య అటువస్తుందేమోనని ఆత్రంగా వెదకసాగాయి. వచ్చి గంటదాటినా ఆమె జాడలేదు.

ఇక ఉండబట్టలేక "వదినా! కన్య కనిపించడంలేదే!ఊళ్ళో లేదా!" అడిగాడు.

"ఇంకెక్కడి కన్య అయ్యా... ఆ పిల్లకి చదువు అబ్బినపుడు పెళ్ళి చెయ్యాల్సింది. ఆర్థిక పరిస్థితుల కారణంతో తల్లితండ్రులు అశ్రద్ధ చేశారు....క్రిందటిసారి నువ్వొచ్చినప్పుడు చూసావా-నిముషానికి ఏదో పనిమీద వచ్చేది. నా కోసం కాదు. నీకోసం- ఆ విషయం అటు పక్కింటికి చుట్టపుచూపుగా చూడ వచ్చిన కుర్రాడితో లేచి పోయిన తర్వాత గాని నా కర్థం కాలేదు....."

ప్రవీణ్ షాక్ తిన్నాడు. ఆమె మాటలు అతనికి వినిపించడంలేదు. ఎందుకిలా జరిగింది? తనూహించింది ఏమిటి? జరిగింది ఏమిటి? చొరవ తీసుకోకుండా వుండడాన్ని తక్కువ తనం కింద జమ కట్టిందా? అతని బుర్ర గిర్రునతిరిగింది. పక్కనే కుర్చీలో కూలబడ్డాడు.

"ఈ చెత్త గోలంతా వాడికెందుకు, ముందు కాఫీ పట్టుకురా" భర్త ఆజ్ఞతో కన్య గురించి చెప్పడం ఆపి లోపలికి వెళ్ళిందామె - మరిది పరిస్థితి గ్రహించలేక ★

(జ్యోతి మాసపత్రిక - ఆగస్టు 1984)